

నాగయ్య నటించు

# త్యాగయ్య

SRI RENUKA FILMS LTD. MADRAS

డైరక్షన్ - నాగయ్య

తారాగణము :

లింగమూర్తి, దొరసామి, రాయప్రోలు, రాఘవన్, న్యాపతి, జయమ్మ, హేమ[illegible], [illegible].

డిస్ట్రిబ్యూటర్సు :

తమిళనాడు, బొంబాయిరాజధాని(మద్రాసుతప్ప):
కొచిన్ ఫిలింస్ కార్పొరేషన్
ఎర్ణకులం

హైదరాబాదు రాజ్యము :
దక్కను ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్
హైదరాబాద్

ఆంధ్ర దత్తమండలములు :
పూర్ణ పిక్చర్సు
బెజవాడ

మైసూరు రాజ్యము :
గ్లోబ్ పిక్చర్సు
[illegible]




సంపాదకుడు—న్యాయపతి రాఘవరావు

సంపుటి 1. | మదరాసు, అక్టోబరు 1945 | సంచిక 3

# ఇది బాగుందీ ?

బాలపుట్టి మూడు నెలలు పూర్తి అయింది. ఇది మూడో సంచిక. మొదటి రెండుసంచికలూ ఆంధ్రలోకం బాగా అందుకుంది.

కాని, కొన్ని లోపాలు యింకా వున్నాయి. ఆ లోపాలు ఏమిటంటే—మొదటిది అచ్చువేసే టైపు. "కొన్ని కొన్ని నాటికలూ, కథలూ చిన్న అక్షరాలలో అచ్చువేస్తున్నారు. చిన్నపిల్లలు ఆ అక్షరాలు చదవలేరు, ఇంకా పెద్ద అక్షరాలు వుండాలి" అంటూ కొందరు తలిదండ్రులు సలహా ఇచ్చారు. ఈ విషయంలో వీలయినంతవరకూ పెద్ద అక్షరాలే వేయడానికి ప్రయత్నిస్తాం.

ఇంక రెండోలోపం; మన "బాల"కి పంపుతున్న రచనలు, కొందరు ఇతర పుస్తకాల్లోవో ఇతరులు రాసినవో "కాపీకొట్టి" తామే వ్రాసినట్టు మాకు పంపుచున్నారు. వారిమాటలు నమ్ముకొని వారిపేరుతో మేము కొన్ని ప్రకటించేం....

ఉదాహరణకి మా సెప్టెంబరు బాలలో "చందమామ రావె" అని ఒకపద్యం శ్రీ గండికోట రామచంద్రా రావుగారు వారు రాసినట్టుగా పంపేరు. కాని, నిజానికి అది వారువ్రాసింది కాదని తెలిసింది. అది 1939 సం॥ లో శ్రీ పన్యాల రంగనాథ రావుగారు వ్రాసి "మాతృసేవ"లో ప్రకటించారు.

ఇంతేకాకుండా- లీలావాచకములోని కొన్ని రచనలు కొన్ని "మక్కీకి మక్కీ" గాను, కొన్ని కొద్దిమార్పులతోనూ పంపారు. దయచేసి ఇకముందు అటువంటి రచనలు పంపవద్దని మా ప్రార్థన.

అన్నిటికన్నా ముఖ్యంగా మేము కోరేది సొంత రచనలు. సొంత రచనలు పంపుతే బాగుంటుందిగాని, దొంగ రచనలు పంపడం బాగుందీ?

"బాల"కు ఆశీస్సులు చాలామంది పంపారు. అన్నీవేయడానికి స్థలంలేదు. క్షమించాలి. స్థలాన్నిబట్టి క్రమంగా వేస్తాం.



తాతయ్యా తాతయ్యా
గాంధి తాతయ్యా
తాతయ్యా నవ్వితే
వెన్నెలలు వెలుగు
తాతయ్యా పలికితే
ముత్యాలు రాలు
తాతయ్యా మాటలే
రత్నాల మూట
తాతయ్యా తాతయ్యా
గాంధి తాతయ్యా !

కె. సభా

[స్వతంత్ర సాహితీసమితి]







# అప్పుడు - ఇప్పుడు:

పూర్వం, అంటే ఎన్నో వేల ఏళ్ల క్రిందట, మనుష్యులు కొండలదగ్గర, అడవుల్లోనూ ఉంటూవుండేవారు. అప్పటిరోజుల్లో ఇప్పటిలాగ ఇళ్లులేనేలేవు, పాపం గుహల్లోనూ, చెట్లక్రింద పొదల్లోనూ ఉంటూవుండేవారు. ఆరోజుల్లో వాళ్ళకి వంట అంటే ఏమిటో తెలీదు. అందుచేత పండ్లూ కాయలూ తింటూ బ్రతికేవారు. వాళ్ళకి పడుకోడానికి మంచాలూ, కూర్చోడానికి కుర్చీలూ అవీ అవుసరం ఉండేదికాదు.

రానురాను వాళ్లు భూములు దున్ని పంటలు పండించడం, పశువులను పెంచడం, నేర్చుకున్నారు. పొలాల్లో చేలు, అడవి పందులూ అవీ తినీకుండా, తమ పశువుల్ని పులులూ అవీ ఎత్తుకుపోకుండా కాపలా కాయడానికి వాళ్ళు ఎత్తుగా గడమంచెలు వేసుకుని వాటిమీద ఉంటూఉండేవారు.

ఇలావుండగా కొన్నాళ్ళకి వాళ్ళు నిప్పు చేయడం, వంటచేయడం నేర్చుకున్నారు. అందుచేత ధాన్యం, పాలు, పెరుగు, వెన్నా అవీ దాచుకోడానికి ఇళ్ళు కట్టుకోవలసి వచ్చింది, ఎండుగడ్డితో పూరిళ్ళు కట్టుకొని కొందరు, తాటాకులతో ఇళ్ళుకట్టుకుని కొందరు, ఉంటూవుండేవారు.

చైనాదేశంలో కేంటన్ అని ఒక రేవు పట్టణం ఉంది. అక్కడ ప్రజలు పడవల్లోనే ఇళ్లుకట్టుకొని పడవలమీదేఉంటారు. చిన్న పిల్లలుకూడ పడవలమీదే ఆడుకుంటారు.

# ఇండ్లకథ

ఇంక ఎడారి దేశాల్లో ఏమిటో తెలుసా? అక్కడ ఇసుకప్రదేశాల్లో ఇళ్ళు కట్టుకోలేరు. అందుచేతవాళ్లు డేరాలు వేసుకుని అందులోనే ఉంటారు.

మరోచిత్రంచూశారా! మంచు దేశాల్లో ఎస్కిమోలనే జాతివాళ్లు 'ఇగ్లూ' అని గుండ్రంగావున్న ఇళ్లుకట్టుకుని అందులో వుంటారు. బొమ్మలో చూడండి ఆయిల్లు ఎలాగుంటుందో!

ఎప్పుడేనా గాలీవానవస్తే గడ్డిళ్ళూ తాటాకు ఇళ్ళూ, ఎగిరిపోతాయి. పొరపాటున నిప్పంటుకుంటే, నిమిషంలో కాలిపోతాయి. అందుచేత కొందరు ఏంచేశారంటే ఇటికలూ, పెంకులూ కనిపెట్టేరు.

ఇటికతో కట్టిన ఇళ్లు దిట్టంగా వుంటాయి...అంతకన్నా గట్టిగా ఉండాలని గొప్పవాళ్ళు రాతితో గోడలుపెట్టి ఇళ్లు కట్టుకుంటున్నారు. మనపల్లెటూళ్లలో వాళ్లు ఇప్పటికీ గడ్డిళ్లే కట్టుకుంటున్నారు. కాని పట్టణాలలో పెంకుటిళ్ళు, మిద్దెఇళ్ళు, మేడఇళ్ళు, రెండంతస్థుల మేడలు, బంగళాలు ఇలాగ అనేకరకాల ఇళ్ళు లేచేయి.

న్యూయార్కు అనే పట్టణం అమెరికాలో వుంది. అవూళ్ళో ఇళ్ళు కట్టుకోడానికి దిగువున స్థలంచాలక, పెద్దపెద్ద 50 అంతస్తులు, 60 అంతస్తుల మేడలు కూడా కట్టేస్తునారు. చూశారా, ఇళ్ళు ఎన్నెన్నివిధాలుగా ఉన్నాయో!











# ఏడవకు ఏడవకు వెఱ్ఱి నా తండ్రీ

నీకళ్ళనించి నీలాలు కారు తున్నాయెందుకు పాపా? ఏడుస్తున్నావా?

అయ్యో—ఎప్పుడూ నిన్ను వేధించుకుతినే ఈ పెద్దవాళ్ళు ఎంత కఠినులు!

చూచివ్రాత వ్రాసేటప్పుడు నీచేతులికీ, ముఖానికీ కొంచం సిరా అంటింది. అందుకనే వాళ్ళు నిన్ను శుభ్రంగా వుండవంటున్నారా?

ఎంతఘోరం! కొంచం సిరా అంటినంత మాత్రానికే వీళ్ళు నిండారు చందమామను కూడా శుభ్రత లేని వాడనేస్తారన్న మాట!

ప్రతిచిన్న పొరబాటుకీ వాళ్ళు నిన్ను దండిస్తారు పాపా! వాళ్ళు వారికే తప్పులు పడతారు.

ఆడుకునేటప్పుడు నీ చొక్కా చినిగింది. అందుకేనా వాళ్ళు నిన్ను కట్టులేనివాడంటున్నది?

ఎంతదారుణం! ఐతే తునకలు తునకలైన మేఘాల నడుమ మనస్సువిప్పి నవ్వే చందమామని ఏమంటారో వాళ్ళు?

వాళ్ళమాటలేవీ పట్టించుకోకమ్మా! వాళ్ళు చెయ్యనితప్పుల్ని లెక్కించి చెబుతారు.

చక్కని వస్తువులంటే నీకెంతో ఇష్టమని అందరికీ తెలుసు. అందుకేనా ఏమిటి వాళ్ళు నిన్ను ఆశపడతావనేది?

ఎంత అన్యాయం? అట్లాఐతే నిన్నింత ప్రేమించే మమ్మల్ని ఏమంటారో వీళ్ళు?

## చెల్లెళ్ళకు-తమ్ముళ్ళకు

ఇంట్లో అమ్మా, నాన్నా—బళ్ళో పంతులూ మిమ్మల్ని వుత్త పుణ్యానికి చీటికీ మాటికీ ఏడిపిస్తారు కదమ్మా? నాకు తెలుసు. మిమ్మల్ని కొట్టరాదని, కసురుకోరాదని, మీ లేత మనసుల్ని నొప్పించడం పాపమని వాళ్ళు ఎంతకూ తెలుసుకోరు.

పెద్దవాళ్ళు మిమ్మల్ని ఇట్లా వేపుకుతినడం ప్రపంచంలో మంచి మనుషులందరికీ బాధగానే వుంది. రవీంద్రనాథటాగూర్ అనే గొప్పకవి మీకష్టాలకు కరిగిపోయి ఎంతో విచారపడి ఈ మాటలు వ్రాశాడు. చదవండి.

—వైదేహి



[శ్రీ వే. కోదండరాములుగారివద్ద చింతా దీక్షితులు
వ్రాసుకొన్న పాట]

తెల్లవారి లేచింది, చిట్టెలుకా
కాళ్ళు మొహం కడిగింది, చిట్టెలుకా
పట్టెనామం పెట్టింది, చిట్టెలుకా
పల్లెత్రోవ పట్టింది, చిట్టెలుకా
ఉల్లిగడ్డ కొరికింది, చిట్టెలుకా
ఊరిత్రోవ పట్టింది, చిట్టెలుకా !

# మీరు చెయ్యగలరా? "బాబులు" కటకం

రాము:- ఓరేయి సోమూ! నువ్వు నూతిలో మొగ్గ వెయ్యగలవురా?

సోము:-నూతిలో మొగ్గ ఎవ్వరైనా వెయ్యగలర్రా? చచ్చిపోరు మునిగిపోయి?

రాము:- నే వేస్తాను, పందెం వెయ్యి!

సోము:-ఏదీ వెయ్యి మీ చూద్దాం?

రాము:-ఇదిగో చూడు!

అని రాము మల్లి చెట్టుకివున్న ఒక "మొగ్గ"ను తెంపి నూతిలో వేసి, చూశావా—నూతిలో "మొగ్గ వేశాను" అన్నాడు.

సోము:- మొగ్గ అంటే ఈ మొగ్గా!...నాకేం తెలుసు ఈ మొగ్గ అని?

రాము:-పోనీ యింకోటి చెబుతాను చేస్తావా?

సోము:-ఏమిటి చెప్పు!

రాము:-నీ కుడి చేతి మండని ఎడమ చేతికి అందకుండా వుంచాలి ...ఉంచు చూద్దాం?

సోము ప్రయత్నించేడు గాని ఏలాగో తెలీలేదు.

'ఏదీ నువ్వుంచుమీ'అన్నాడు సోము.

రాము చేసిచూపించాడు.

మీరు అలా చెయ్యగలరేమో చూడండి?

ఇంకో ప్రశ్న...

"కొవ్వొత్తి దీపాన్ని నువ్వు పట్టుకోవాలి. అది అందరికీ కనిపించాలి గాని, నీకుమాత్రం కనిపించ కూడదు ఎలా? పట్టుకో చూద్దాం?"

పాపం సోము ఇదికూడా చెయ్యలేకపోయినాడు. రాము అవన్నీ ఎలా చేశాడో... పేజీలో వున్నాది చూడండి.

---

అట్టమీది బొమ్మ : ముద్దుపేరు "పండు"

అసలు పేరు : శ్రీనివాస పాండురంగ విఠల అనంత పద్మనాభ పట్టాభి రామమూర్తి!

చాలా చిన్న పేరుకదూ! "ఈ అబ్బాయి చిలిపినవ్వులోనేవుంది పెంకితనంఅంతానూ!" అని రాస్తోంది కొత్త ఢిల్లీలోవున్న వాళ్ల అత్త.



తారంగం తారంగం

తాండవ కృష్ణా తారంగం

వేణూనాథా తారంగం

వెన్నా ముద్దల తారంగం!

ఆలా బాలా తారంగం

ఆడుకో పాపా తారంగం!

సంపాదన—ఆంజనేయ,

పిఠాపురం,

15 సంII లు.

కో. వరహాలమ్మ,

దార్లపూడి,

14 సంII లు.



# అక్కతో 5 నిముషాలు

క్రిందటి సంచికలో పిల్లలందరూ ప్రతీ ఊళ్లో సభలు చేసి బాల సంఘాలు స్థాపించాలి, ఆ సంఘాలన్నీ 'మదరాసు బాలానంద సంఘం' తరఫున పనిచెయ్యాలి, ప్రతీ నెలా ఏఏ పనులు ఆ సంఘాలు చేస్తాయో తెలియజేయాలి అంటూ సూచించేను. దానికి ఫలితంగా మన బాలానంద సంఘంలో యీ దిగువ పిల్లలు మెంబర్లుగా చేరారు. చాలా సంతోషం.

మద్రాసు :

నిడదవోలు శ్యామల; నిడదవోలు మాలతి; నిడదవోలు బాలాజీ సూర్యారావు; నిడదవోలు సీతారాం; టి. వెంకటేశం.

రాజమండ్రి :

దాసు పద్మనాభరావు; డి. వి. నారాయణరావు.

కడప :

పాళెం సరోజనిదేవి; పాళెం శ్రీనివాస; పాళెం మోహన్ గోపాల్; పాళెం వనజాక్షి; పాళెం రాధాకృష్ణ; పాళెం హరికృష్ణ; పాళెం విజయభారతి; పాళెం స్వర్ణలత; పాళెం మురళీకృష్ణ; యస్. లక్ష్మీనారాయణ; యస్. లక్ష్మీకాంతం; ఆర్. వెంకటరత్నం; టి. లక్ష్మీదేవి.

మానేపల్లి :

ఎ. దుర్గాకుమారి.

భీమునిపట్నం :

కవిగొట్ల భాస్కరరావు; కవిగొట్ల ప్రభాకరరావు; కవిగొట్ల సూర్యనారాయణమూర్తి; కవిగొట్ల సుగుణదేవి; మొగసాల వెంకటరత్నం; మొగసాల వెంకటరావు; మొగసాల అప్పారావు; మొగసాల సాధూరావు.

రేపల్లె :

యమ్. ఎ. లతీఫ్.

రాయఘుడ :

కె. వీరరాఘవరావు.

కిర్ప్రో (సింధురాష్ట్రం):

వి. పి. దుర్గాబాయి.

ఇంతే కాకుండా ఇదివరకే కొన్నికొన్ని ఊళ్లలో బాలసంఘాలు పెట్టేరు. ఆ సంఘాలు చేస్తున్న పనులగురించి మాకు ఈదిగువ వివరాలు వచ్చేయి.

# బాలసంఘాలు

## తాడికొండ బాలసంఘం :

ఈ సంఘం గత మూడు సంవత్సరాలనుంచీ పనిచేస్తోంది. ఇప్పటికి 315 మంది బాల బాలికలు సంఘంలో చేశేరు. పిల్లలు చక్కని ఆటలూ పాటలూ నేర్చుకుంటున్నారు. బెంగాలు కరువునిధికి, కస్తురిబా గాంధి నిధికి డబ్బు వసూలుచేశారు. వినాయక చవితి ఉత్సవంచేశారు. ఈ సంఘానికి యీ యేడు శ్రీ కందుల గోపయ్యగారు అధ్యక్షులు. పెద్దికోటేశ్వరరావుగారు కార్యదర్శి. మొన్నజరిగిన మీటింగులో, తాడికొండకు హైస్కూలు కావాలనిన్నీ, విరాళాలు కావాలనిన్నీ, బాల పత్రిక తెప్పించాలనిన్నీ తీర్మానించేరు.

## బెజవాడ తాలూకా బాల సంఘాలు :

1943 నుంచి 12 బాల సంఘాలు 800 సభ్యులతో యీ తాలూకాలో పనిచేస్తున్నాయి. సంక్రాంతి రోజుల్లో జూదములు పందెములు వేయనియ్యకుండా, వినాయకచవితికి ఇండ్లపై రాళ్ళు రువ్వకుండా— ఇంతే కాక బెంగాల్, రాయలసీమ, విశాఖ క్షామ నిధులు వసూలుచేయడం— ఇటువంటి పనులు చేసియున్నారు.

## కోసూరు బాలమిత్ర సంఘం :

ఈ సంఘం ప్రతి ఆదివారం వాక్యర్థినీ సభలుచేసి, వ్యాసరచన పోటీలు పెట్టి ఎంతో సేవచేయుచున్నది. ఇప్పుడు బాలకవితా కుటీరము యేర్పరిచినది. "బాలమిత్ర" అని ఒక చేవ్రాత పత్రిక ప్రచురించు చున్నది.

## ప్రొద్దుటూరు బాల సంఘం :

ఈ సంఘం "బాలశక్తి" అనే మాసపత్రిక ప్రచురిస్తోంది. తద్వారా బాల వాంగ్మయానికి సేవచేస్తోంది.

## తిరుపతి సరస్వతీ స్టూడెంటు సంఘం :

ఈ సంఘం ప్రతీవారం సభలు జరుపుతోంది. పెద్దపెద్ద సభలలోకూడా ఈ సంఘ సభ్యులు ఉపన్యాసాలిస్తున్నారు.

### ఉప్పుగుండూరు బాలసంఘం :

ఈ సంఘం 3 వ వార్షిక మహాసభ సెప్టెంబరు 5 తేదీని జరిగింది. ఈ సభకు 1,500 మంది తలితండ్రులూ, 'తమబిడ్డల ప్రదర్శనములూ అవీ చూడడానికి వచ్చారు.

ఆట పాటల పోటీలుజరిగి బహుమతులు ఇయ్యబడ్డాయి.

"అల్లరి సూర్యం" అని ఒక నాటిక కూడా బాల బాలికలు ప్రదర్శించారు.

### కోర్సండ విద్యార్థి సంఘం (పర్లాకిమిడి):

ఈ సంఘం 1-4-1945 న స్థాపింపబడింది. డాక్టరు పోలాకి శ్రీనివాసరావుగారు యెంతో శ్రద్ధవహించి యీ సంఘానికి సహాయపడుతున్నారు. ఆరోగ్య నాటకాలూ, వ్యాసాలూ, పాటలూ, పోటీలూ అవీ జరిపిస్తున్నారు. ఈమధ్యనే "సుజీవన్" అనే నాటిక బాల బాలికలచేత వేయించారు.

### పిల్లలసంఘం, త్యాగరాయనగర్

ఈ సంఘంలో పిల్లలు, నృత్యం చేయడం, నాటికలు వేయడం మొదలగునవి చేస్తున్నారు. శ్రీ నాళం రాఘవమ్మగారు యీసంఘాన్ని నడుపుతున్నారు. కొందరు అరవ పిల్లలు కూడా యీ సంఘంలో ఉన్నట్లు తెలియుచున్నది.

### భీమునిపట్నం :

### శ్రీ బాలానంద సంఘసభ ;

తే 28-8-45 దీని శ్రీ కవిగొల్ల భాస్కరరావు (వయసు 8 సం॥) అధ్యక్షతను యీ సభ జరుపబడినది. 8 మెంబర్లతో బాలానంద సంఘం ఏర్పాటు చేశారు.

## మీరు చేయగలరా?

సమాధానాలు

ఎడమచేతి మణుకుని కుడిచేత్తో పట్టుకుంటే, మరి ఎడమచేతికి కుడిచేతి మండ అందదు.

* * *

కొవ్వొత్తిదీపాన్ని పట్టుకొని తలమీద పెట్టుకుంటే, పెట్టుకున్నవారికి మరి ఆదీపం కనిపించదు.



# పిట్ట—పిల్ల

పిల్ల :—పిట్టా! పిట్టా! ఎక్కడికీ?
రావా, రావా? ఇక్కడికీ?
పాటా కలసీ పాడూదాం
ఆటా కలసీ ఆడూదాం
ఇవిగో గింజలు తినవేమి?
రావా రావా ఇక్కడికీ?

పిట్ట :—రానూ, రానూ, అక్కడికీ!
వచ్చిన నీవూ పట్టేసి
పంజరమునా పెట్టేస్తావ్!



సి. హెచ్. ఆచార్య,
హైదరాబాద్.

# రష్యా

[ఈ రచనకు "ప్రజాశక్తి" వారి "సోవియట్ బాలబాలికలు" అన్న పుస్తకము, శ్రీ కె. నరసింహారావుగారు పంపిన వ్యాసము చాలా సహాయపడినవి. రష్యాదేశపు పిల్లల బ్లాకు "ప్రజాశక్తి" కార్యాలయం వారు దయతో యిచ్చిరి—సం॥]

మన హిందూదేశంలాగే రష్యా దేశం చాలా పెద్దది. ఇటు జర్మనీనుంచి అటు జపానువరకూ ఉంది రష్యాదేశం.

పూర్వం యీ రష్యాదేశాన్ని రాజులు ఏలుతుండేవారు. ఆ రోజుల్లో పాపం ఆ దేశంలో బీద వాళ్లు చాలాకష్టపడేవారు. మన దేశంలోలాగే, పిల్లలు చదవడానికి కావలసినన్ని బడులు లేక, రోగులకు ఆస్పత్రులు లేక, కట్టుకుందుకు ఉన్ని బట్టలు లేక చాలా బాధపడేవారు. గొప్పవారు మాత్రం అన్నిసుఖాలు పొందేవారు. బీదవారు నానా బాధలూ పడేవారు. అందుచేత ఆ దేశంలో ప్రజలకి చాలా కోపంవచ్చింది. "బీదవాళ్ళ సౌఖ్యం, పిల్లల చదువూ అవీ చూడని రాజు మాకొద్దు" అని అందరూకలిసి ఆ రాజుని రాజ్యంనుంచి తీసేశారు. రాజ్యంఅంతా రయితుల్దే, కూలీలదే అన్నారు.

ఇకముందు గొప్పవాళ్ళు, బీదవాళ్ళుఅన్న భేదం లేదన్నారు.

రాజ్యం అందరిదీఅన్నారు.

అందరూ సుఖపడాలన్నారు.

అందుకోసం ముందుగా పిల్లల సౌఖ్యం, పిల్లల చదువూ, వాళ్ళ ఆరోగ్యం ముఖ్యంఅన్నారు.

"బిడ్డకోసం తల్లి—తల్లికోసం బిడ్డ"—అని చెప్పేరు. బిడ్డలను పెంచడం, చదువు చెప్పించడం,

ఆ పనులన్నీ ఇకముందు గవర్నమెంటువారే పూనుకుంటా మన్నారు. ఎందుచేతంటే— రష్యాలో సంవత్సరానికి సుమారు 70 లక్షలమంది పిల్లలు పుడుతున్నారు. వారికి ఉగ్గూ, పాలూ, ఉయ్యాలలూ, బట్టలు, చదువు, ఆటలు అన్నీ ప్రతిబిడ్డకీ ప్రతి తల్లీ ఇయ్యగలదా? అందుచేత సోవియట్ గవర్నమెంటువారు ఆ పనంతా తామే పూనుకున్నారు.

సోవియట్ రాజ్యంలో ఇప్పుడు ఏమూల ఏచిన్న పల్లెటూళ్లో పిల్ల పుట్టినాసరే, వెంటనే గవర్నమెంటు డాక్టర్లు, నర్సులు వచ్చి, డబ్బు పుచ్చుకోకుండానే సేవచేస్తారు.

పిల్లల ఆరోగ్యంచూస్తారు.

మంచిపాలు ఇస్తారు.

ఉన్నిబట్టలు ఇస్తారు.

ఇంతేకాకుండా సోవియట్ గవర్నమెంటువారు శిశుపోషణాలయాలను పెద్దపెద్ద గ్రామాలలో పెట్టేరు. అందులో ఈ చిన్నచిన్నపిల్లలందరినీ చేరుస్తారు.

అక్కడ వందలకొద్దీ పిల్లలు, చక్కగా కిలకిల నవ్వుతూ కలిసి మెలసి ఉంటారు.

పిల్లలు ఆడుకుందుకు ఎన్నో ఆటవస్తువులు ఆ ఆటమందిరాల్లో ఉంటాయి. పిల్లలు, వారి ఇష్టం వచ్చిన బొమ్మలు తీసుకుని ఆడుకుంటారు.

ఇంకో పద్ధతికూడా వుంది. రష్యాలో చాలామంది తల్లులు ఫేక్టరీలలో కూలిచేసుకుని బతుకుతారు.

పాపం వాళ్ళకి చేతిపిల్లలుంటే వాళ్ళగతి ఎలాగ?

అందుచేత గవర్నమెంటువారు అటువంటి కూలీస్త్రీల పిల్లల్ని ఆడిపించడానికి పెద్ద ఆటమందిరాలు స్థాపించేరు.

తల్లి ఫేక్టరీలో పనిచేస్తుంటే,

పిల్లలు ఇక్కడ హాయిగా ఆడు కుంటారు. పిల్లలికి ఆకలివేస్తే ఆహారం, పాలూ ఇయ్యడానికి అక్కడ ఎందరో దాదులు ఉంటారు.

ఇదంతా ఎందుకంటే, దేశం బాగుపడాలంటే అదంతా పిల్లల మీద ఆధారపడివుంది.

పిల్లలు బాగా ఆరోగ్యంగా పుష్టిగా ఉంటే, వాళ్ళు పెద్ద వాళ్లయి దేశానికి బాగా సేవ చేసి, దేశానికీ, తమకీ కీర్తి తెస్తారు.

ఇటువంటి భాగ్యం మన హిందూ దేశంలోని పిల్లలకు ఎప్పుడు కలుగుతుందో!



సోవియట్ శిశుపోషణాలయంలో

# బాలకు నా ఆశీస్సులు



**పొట్టిబావ**

బాల ఛంగనుచు నెలబాల జూచింది
కలకలమని బాల కదలి వచ్చింది.
వచ్చి మచ్చికలూర మాటలాడింది
ఇంటింట నొక తెలుగుబాల వెలిగింది ॥

చిన్నిబాలనుజూచి చేతనెత్తారు
తెలివితేటలుజూచి తెల్లబోయారు
ఎందరుంటే నేమి సందడన్నారు
ముందుగా నెత్తుకొని ముద్దులాడేరు ॥

అన్నదమ్ములగలసి ఆటలాడింది
కమ్మనౌపాటలు కథలు జెప్పింది
తెలుగుపిల్లల రుచుల్ తేటబరచింది
తెలుగునాడులతాను తరలి వెలసింది ॥

మీ బాల వేయేళ్లు మహిని వెలగాలి!
మీ బాల వేయేళ్ళు మసలి తిరుగాలి!



# సరళా



సరళ, పొద్దున్నే లేచి జడ వేసుకొని బొట్టు పెట్టుకొని కలకల లాడుతూ ఉంటుంది.



సరళ, తన పుస్తకాలూ వస్తువులు అన్నీ శ్రద్ధగా సర్దుకొని ముచ్చటగా ఉంచుకుంటుంది.



సరళ, తన పాఠాలు శ్రద్ధగా చదుకొని వేళకు బడికి వెళ్తుంది.



సరళ అంటె వాళ్ల నాన్నకీ, అమ్మకీ ఎంతో ఇష్టం.

# విరళా





విరళ, జడ వేసుకోకుండా మాసిన బట్టల్తో, అసహ్యంగా ఉంటుంది.



విరళ, తన పుస్తకాలూ, వస్తువులూ ఇష్టంవచ్చినట్టు ఇంట్లో పడేస్తుంది.



విరళ, బడి ఎగవేసి ఇంట్లో కూర్చుంటుంది.



విరళ అంటే వాళ్లమ్మకీ నాన్నకీ ఎంతో అసహ్యం.

**నాటుకథలు :**

# పేను కథ

[పేను కథని సంపాదించి పంపినవారు :—శ్రీయుతులు చింతా దీక్షితులు; మేడేపల్లి వరహా నరసింగరావు (విజయనగరం); గూడూరు సుభద్రమ్మ (విజయనగరం); యస్. పాండురంగయ్య (హిందుపూరు); దిట్టకవి లక్ష్మీమోహన్ (భీముని పట్నం); కురుముద్దాలి రామచంద్రమూర్తి శర్మ (బెజవాడ); దేశిరాజు వెంకట చంద్రశేఖరరావు; హెచ్. వి. రమణారావు (గోల్మారి)—సం॥)

అనగా అనగా ఒక పేను ఉండేది. ఆ పేను పెసరచేను వేసుకుంది. ఒక నాడు, ఆ ఊరిరాజు, పల్లకీ ఎక్కి ఆ పెసరచేను పక్కనుంచి అలా వెళ్తున్నాడు.

రాజు—ఏయ్! బోయీలూ! పల్లకీ ఆపండి!

బోయీ—చిత్తం మహాప్రభూ!

రాజు—ఈ పెసరచేను ఎవరిది?

బోయీ—ఇది పేను వేసిన పెసరచేను మహాప్రభూ!

రాజు—హె హ్హె హ్హె—పేనుదా? పేనుకేవిటి, పెసరచేనేవిటి! ఆ పేనుని పట్టుకొని, నొక్కండోయ్!

[ఆ మాటలు పేను వింది. విని అందీ—]



పేను—ఓహో అలాగా! రాజుకేవిటి, పల్లకీ యేవిటి! బయటికిలాగి తొక్కండోయ్!

రాజు—ఓహో! ఇంత ఉన్నావో లేదోగానీ, అంత గర్వంగా వుంది నీకూ!... ఉండుండు నీ పని పట్టిస్తాను... ఒరీ బోయీ!

బోయీ—చిత్తం మహాప్రభూ!

రాజు—రేపు పొద్దున్నే కోటలో వున్న ఆవులన్నిటినీ ఇక్కడికి తోలుకొని వచ్చి, యీ పేను వేసిన పెసరచేనంతా మేపించేయ్.

బోయి—చిత్తం ప్రభూ!

[రాజు వెళ్ళిపోయాడు తరువాత పేను అనుకుంది—]

పేను—అయ్యో! ఏలాగ! రేపు రాజుగారి ఆవులు ఒచ్చి నా పెసరచేనంతా మేసేస్తాయి ఎలాగ?... కానీ, దీనికో ఉపాయం ఆలోచిస్తా...

[అని పేనేంచేసిందీ—చేనులోవున్న పెసరకాయలన్నీ కోసి, ఒలిచి, రుబ్బి, పెసరట్లుపోసింది. ఆ పెసరట్లు, ఒక్కొక్క ముక్కా తింటూ అలాగ అడవి

లోనుండి వెడుతోంది. ఇంతట్లోకీ దారి లో ఒక తేలు కనబడింది.]

తేలు—పేను నేస్తం! పేను నేస్తం ఎక్కడికి వెడుతున్నావ్ ?

పేను—రాజుని చంపడానికి వెళ్తున్నాను.

తేలు—నువ్వు తింటున్నది ఏమిటీ ?

పేను—పెసరట్టు.

తేలు—నాకో ముక్క పెట్టవ్ ?

పేను—నాతో వస్తావా, నీకో ముక్క పెడతాను—

తేలు—అలాగే—

పేను—అయితే రా...ఇదిగ పెసరట్టుముక్క...



[తేలూ, పేనూ కలిసి అలాగ వెళ్తు ...యి...ఇంతట్లోకీ ఒక పాము ఎదు ...ంది.]

పాము—పేను నేస్తం పేను నేస్తం--- ...డికి వెడుతున్నావ్ ?

పేను—రాజుని చంపడానికి.

పాము—నీనోటిలోనిది అదేమిటి?



పేను—పెసరట్టు.

పాము—నాకో ముక్క పెట్టవ్ ?

పేను—నాతో వస్తావా, నీకో ముక్క పెడతాను.

పాము—అలాగే.

పేను—అయితే రా...ఇదిగ పెసరట్టుముక్క.

[పేనూ, తేలూ, పామూ పెసరట్టు ముక్కలు తింటూ, అలాగ వెళుతున్నాయి. కొంతదూరం వెళ్ళేసరికి ఒక పెద్ద చట్రాయి కనబడింది.]

రాయి—పేను నేస్తం, పేను నేస్తం ఎక్కడికి వెళ్తున్నావ్ ?

పేను—రాజుని చంపడానికి!

రాయి—నువ్వుతింటున్న దేమిటి ?

పేను—పెసరట్టు.

రాయి—నాకో ముక్క పెట్టవ్ ?



పేను—నాతో వస్తావా—నీకో ముక్క పెడ్తాను.

రాయి—అలాగే.

పేను—అయితే రా...ఇంద పెసరట్టుముక్క.

[పేనూ, తేలూ, పామూ, చట్రాయి కలిసి అలాగ మరికొంత దూరం వెళ్ళే సరికి, ఒక పెద్దపులి కనబడింది.]

పులి—పేను నేస్తం, పేను నేస్తం—ఎక్కడికి వెళ్తున్నావ్ ?

పేను—రాజుని చంపడానికి.

పులి—నీ నోటిలోనిదేమిటి ?



పేను—పెసరట్టు.

పులి—నాకో ముక్క పెట్టవూ ?

పేను—నాతో వస్తావా—నీకో ముక్క పెడతాను ?

పులి—అలాగే—

పేను—అయితేరా...ఇంద, పెసరట్టుముక్క.

[పేనూ, తేలూ, పామూ, చట్రాయి, పెద్దపులీ కలిసి, ఆ రాత్రి రాజుగారి కోటలోకి నెమ్మదిగా ప్రవేశించేయి. రాజుగారు యేడంతస్థుల మేడమీద గుర్రుపెడుతూ నిద్రపోతున్నారు— ]

పేను—ఇస్...చప్పుడు చేయకండి...నెమ్మదిగా ఇలారండి, పెద్దపులీ, నువ్వేం, ఈ వీధి గుమ్మం దగ్గర కాపలా కాస్తూ వుండు. లోపలి వాళ్లు బయటికి పోకుండా, బయట వాళ్లు లోనికి రాకుండా చూడు.

పులి—అలాగే పేను నేస్తం.

పేను—చట్రాయి—నువ్వేమో పెరట్లో పందిరి మీద ఉండు. రాజుగారు ఇలా వస్తే నువ్వు దబ్బున కింద పడు. యేం ?

రాయి—అలాగే పేను నేస్తం—

పేను—ఇదుగో పామూ—నువ్వు ఆ మూల కర్రవుందే—అక్కడుండు. ఎవరేనా అక్కడికి వస్తే బుస్సుమని మీద పడు.

పాము—అలాగే పేను నేస్తం.

పేను—ఇదుగో తేలూ—నువ్వు ఆ దువ్వెన వుందే, గూడు, ఆ గూట్లో

కందు—ఎవరేనా గూట్లో చెయ్యి పెడితే టక్కుమని పొడిచీ—యేం?

తేలు—అలాగే పేను నేస్తం.

పేను—సరే—నేను ఇప్పుడు రాజుగారి తలలో దూరుతాను.

[పేను రాజుగారి తలలో దూరి, కరవడం మొదలెట్టింది—]

రాజు—ఇస్—అబ్బ! తల ఊరికే నురదేస్తోంది. అబ్బబ్బ!—దువ్వెనతో దువ్వుకోవాలి. దువ్వెన యేదీ?... అదుగో గూట్లో వుంది. తెచ్చుకుంటా.

* * *

అబ్బబ్బ! యేమిటో కరిచేసింది! గూట్లో చెయ్యిపెట్టేసరికల్లా టక్కున పొడిచేసింది......అమ్మయ్యో! తేలు! తేలు!...కర్రేదీ? కర్రేదీ?—అదుగో ఆ మూలనుంది—తెస్తా—

(పాము బుస్)

అమ్మయ్యో పాము! పాము! పెరట్లోకెళ్ళి పందిట్లో కర్రతెచ్చి దీన్ని చంపుతా...

(దుబ్బున చట్రాయి)

బాబోయ్—పందిరిమీంచి ఎంత పెద్ద చట్రాయి పడిందో! కొంచెంలో తప్పింది లేకపోతే నేను చావవలసిందే గా!...అదుగో పాము వెంటతరుముతోంది వీధిలోకి పారిపోతా—

(పెద్దపులి అఱుపు)

అయ్యో బాబోయ్!—పెద్దపులి!—చచ్చేను ఎలాగ?

పేను—యేం రాజా?...కులాసాగా వున్నావా?

రాజు—ఎవరదీ?...అమ్మ పేనూ! నువ్వా?...ఎంత పని చేశావ్?... పేనూ! పేనూ! నన్ను రక్షించవూ?

పేను—యేం రాజా! అనవసరంగా నా పెసర చేనంతా పాడుచేయిస్తానన్నావు కదూ! ఇప్పుడు నీ గర్వం అంతా యేమయింది?

రాజు—పేనూ! పేనూ! క్షమించు—ఇకముందు ఎన్నడూ నీజోలికి రాను.

పేను—సరే-పో—రండర్రా మనం ఇంటికిపోదాం.



# మా చెల్లి

అంకితం : "చెల్లి"కి

రచన : కుచ్చు సుబ్రహ్మణ్యం

చిరునవ్వుతో చెల్లి
చిందులాడింది !
రానిమాటలు చెప్పి
రాగాలుతీసింది !

*　　*　　*

ఎత్తుకోమంటుచే
యి త్తిచూపింది !
ఏడ్చింది ముముచూచి
ఎత్తుకోకుంటేను !

*　　*　　*

ఏమిత్తో చక్క పాప
ఏడు స్తున్నంటేను
పరుగున నేబోయి
పాటపాడాను !
ఆనందముగ చెల్లి
ఆలకిస్తూ, అల్లి
మేను మరచీపోయి
కానిరాగము తీసి
వింతగా ననుచూస్తూ
వెక్కిరించింది !

# జేజి మామయ్య పాటలు

## దాగురుమూతలు

నాన్నకోటు వెనక్కా—నక్కి కూచుంటా
"అమ్మా! వెతుక్కో"మంటా!

అమ్మ వెతక లేక—
అటూ ఇటూ చూస్తే

కాళ్ళ గజ్జలు
ఘల్లుఘల్లు మనిపిస్తా
కొద్దిగ ఒంగి కనిపిస్తానూ—

అమ్మ నన్ను చూసీ—పట్టుకోవస్తే
అందకుండ—పారిపోతాను

"ఇంద ఇంద పాపా
ఇంద తాయం"వంటూ

అమ్మ నా వెంట వస్తుంది—
అమ్మ చేతిలోనీ—తాయాన్ని చూచీ
అట్టట్టె దొరికిపోతానూ!

మదరాసు ఆలిండియా రెడియోవారి అనుమతితో

# నీ విధి

## శ్రీ మాగంటి బాపినీడు

[శ్రీ మాగంటి బాపినీడుగారు "తెలుగు తల్లి" అని ఒక పుస్తకం వ్రాశారు. అది యిప్పుడు అచ్చులోవుంది. ఆ పుస్తకంలో పిల్లలగురించి యెన్నో విషయాలు రాశారు. అందులోనుంచి యిది తీయబడింది.—సం॥]

రావిచెట్టుకు, మఱ్ఱిచెట్టుకు పెద్ద కొమ్మలుంటాయిగదా! అవి పొడుగుగానో, తిన్నగానో, వంకరగానో, లావుగా అన్నివైపులకు ఎదుగుతాయి. కాని లేత మొక్కగా ఉండగా ఆ కొమ్మ నువ్వు ఎలా వంచితే అట్లాగే వంగుతుంది.

నీవూ అంతే. చిన్నవాడివి గనుక నీ మనస్సు మెత్తగా ఉంటుంది. మెత్తని మట్టితో కుమ్మరివాడు చూడు బొమ్మలు, కుండలు ఎన్ని రకాలుగానో తయారుచేస్తాడు. ఇదేవిధంగా చిన్నప్పుడు మీ అమ్మా, నాన్న ఎంత చక్కగా పెంచితే నువ్వు పెద్దవాడవయిన తరువాత అంత తెలివిగలవాడివి, మంచివాడివి అవుతావు.

చిన్నప్పుడే మీఅమ్మ, నాన్న నీ మనస్సును మంచిదానిగా తయారుచేస్తారు. అంతేకాదు. నీ క్లాసులో నీ స్నేహితులను బట్టి, నువ్వు చదివే పుస్తకాలనుబట్టి కూడా నీ మనస్సు మంచిదిగానో, చెడ్డదిగానో తయారవుతుంది. టాగూరు, గాంధీలలాంటి గొప్ప వాళ్లు చిన్నప్పుడు వాళ్ల అమ్మ అక్క చెప్పిన మంచిమాటల వలన మంచివాళ్లయ్యారు. మీ దొడ్లో ఏగింజలు పాతిపెడితే ఆ రకం మొక్కలే మొలుస్తాయి.

ఇప్పుడు నీ మనసులో ఏఉద్దేశాలు నాటితే అవే మొలకెత్తి నువ్వు పెద్దవాడివయిన తరువాత పెరిగి పెద్దవై పూవులుపూసి, కాయలు, పళ్ళు పండుతాయి. అందుకే నువ్వు మంచి మాటలువినాలి. మంచివాళ్లతో సావాసం చెయ్యాలి. మంచి పుస్తకాలు చదవాలి. బ్రతికినన్నాళ్ళు బాగా బ్రతకాలి. మంచివాడవు అనిపించుకోవాలి.

## పట్టుదల

ప్రహ్లాదుడు చూశావా? చిన్నతనంలోనే దైవభక్తికలిగి అన్నమాట, పట్టినపట్టు విడవలేదు.

మార్కండేయుడు అనే కుర్రవాడు 16 ఏండ్లకే తపస్సు చేసి చావును తప్పించుకున్నాడు. ధ్రువుడు అనే బాలుడు తన సవతితల్లి అగౌరవంచేస్తే అడవికివెళ్లి తపస్సు చేశాడు. గొప్పవాడు అయినాడు.

శంకరాచార్యులు 16 ఏళ్లలోపలనే అన్ని విద్యలు నేర్చుకున్నాడు. 32 సంవత్సరాలకే ఇండియాఅంతా తిరిగి మతాన్ని బోధించాడు. స్వామివివేకానంద చిన్నవయస్సులోనే అమెరికా వెళ్ళి మనమతం బోధించాడు. ఇల్లా వీళ్లందరూ గొప్పవాళ్లయినట్టే నువ్వూ కావచ్చును. నీ పేరు అందరు చెప్పుకుంటారు. నీకు అలాంటి గొప్పకోరిక ఉండాలి, పట్టుదల ఉండాలి, పనిచెయ్యాలి.

అన్నింటికంటె ముఖ్యం—నీకు క్రమశిక్ష ఉండాలి. వేళకు నిద్రలేవాలి, వేళకు తిండితినాలి, వేళకు ఆటలు, వేళకు చదువు. వేళకు నిద్రఉండాలి. నీబట్టల్ని, శరీరాన్ని పరిశుభ్రంగా ఉంచుకో. రోజూ కసరతుచెయ్యి. శుభ్రమైన ఆహారం కావలసినంతే తిను.

చదువుకొని గొప్పవాడిని కావాలి అనేపట్టుదల ఉండాలి. శ్రద్ధగా, మనస్సును అటు ఇటు చెదరిపోనీయకుండా చదువుకో. ఆలా చేస్తేనే చదివింది బాగా జ్ఞాపకం ఉంటుంది. మంచి పాటలు కూడా నేర్చుకో, చక్కని దస్తూరి

వ్రాయడం నేర్చుకో— లేకపోతే నువ్వు వ్రాసింది చదవడానికి అందరు అసహ్యించుకుంటారు.

మనస్సులో చెడ్డఆలోచనలు ఉండకూడదు. అందరికి మంచిని కోరు. ఎవరిని తిట్టరాదు. ఇతరులు నీకంటె తక్కువని, ఎక్కువని, పేదవాళ్లని, అనుకోరాదు. ఒకటేదేశం మనది. ఒకటేజాతి మనది. కూలివాళ్లు, పేదవాళ్లు, సాయిబులు, క్రైస్తవులు అందరం ఒకటే అనుకొని సమానంగా చూడాలి. రోజూ భగవంతుణ్ణి ప్రార్థించాలి. ప్రహ్లాదుడుచూడు:

"తనయందు నఖిల భూతము
లందు నొకభంగి సమహిత
త్వంబున జరుగువాడు"

చూశావా ఎంతమంచివాడో— తనెలా సుఖంగా ఉండాలనుకుంటాడో అందరు, అన్ని జంతువులు పక్షులు కూడా అలా తనతో సమానంగా సుఖంగా ఉండాలి అనుకునే వాడట.

పిరికితనం పనికిరాదు. నెమ్మది, ధైర్యంఉండాలి. పెద్దపులి ధైర్యం, సింహపు పరాక్రమం, ఏనుగు బలం, గుఱ్ఱపు నడక, చందమామ చల్లదనం నీకుకూడా వుండాలి. హృదయం వెన్నలా మెత్తగాను మనస్సు వజ్రంలా గట్టిగాను ఉండాలి. సోమరిపోతులతో కలసి తిరగడం, చీట్లపేక ఆడటం చాలాతప్పు. చీమలు చూశావా ఎప్పుడూ ఎలా పాటుపడతాయో?

## దేశభక్తి

నీవుపుట్టినదేశం, నిన్ను పెంచిన దేశం నీకు పాడిపంటలను ఇచ్చి పోషించుతూన్న దేశం అంటే నీకు ప్రేమ, భక్తి ఉండాలి అని చెప్పానుకదూ! దేశభక్తి లేని వారు బ్రతికివున్నా చనిపోయినా ఒకటే. దేశనాయకులను, దేశవీరులను పూజించాలి. వారు ఎందుకు అంత గొప్పవారు అయ్యారు? దేశానికి ఏంచేశారు? మనమేమిచెయ్యాలి? ఏమిచెయ్యగలం? మనంకూడా వాళ్ళంతటి వాళ్ళం ఎందుకు కాకూడదు? ఆలోచించు బాగా ఆలోచించు.

# మోటారు బండి



[శ్రీ సూరపురాజు సత్యనారాయణ, కర్నూలు]

బుంయూ బుంయూ మోటారూ
మనుషుల నింపుక మోటారూ
ఉరుకుచు ఉరుకుచు మోటారూ
మా ఊరికి వచ్చెను మోటారు.

* * *

అమ్మా నాన్నా అందరమూ
ఎక్కితిమందులో వేగిరమే
ఉరికెను ఉరికెను మోటారూ
దానితో అందర మురికితిమీ!

* * *

కొండలు నదులూ పరుగిడెనూ
మొక్కలు చెట్లూ పరుగిడెనూ
భూమియు వేగమె పరుగిడెనూ
హాయిగనుండెను మోటారూ!

* * *

గింయూ గింయూ మోటారూ
బుంయూ బుంయూ మోటారూ
ఆగియుండెను మోటారూ
అక్కా బావా యెదురైరీ!

* * *

ఎంతలోవస్తిమి మేమంతా
అక్కా బావా తెలుసామీకు?
బుంయూ బుంయూ మోటారూ!
గింయూ గింయూ మోటారు!

---

ఈ పాట రచయిత అనుమతిలేనిదే ప్రకటించకూడదు. సభలలో పాడకూడదు. ఇంట్లో మీరు పాడుకోవచ్చును. —సం॥

చీనా దేశంలో తరచూ చెప్పుకొనే కథ :

# భూతాన్ని అమ్మిన మనిషి!

కిశోర్ బాబు

ఉత్తర చైనాలో ఒక చిన్న పల్లెటూరువుంది. ఆ పల్లెటూళ్ళో 'టింగ్ పో' అనే రైతువున్నాడు. అది పల్లెటూరు; అంచేత కావలసిన సామగ్రి అక్కడ దొరకదు. కాని, ఆవూరికి మూడుక్రోసుల దూరంలో ఒక పట్టణం వుంది. ''టింగ్ పో'' ఆ పట్టణానికి అప్పుడప్పుడు వెళ్ళి కావలసిన సామగ్రి తెచ్చుకునేవాడు.

ఇలావుండగా, మన దసరా పండుగల్లే, వాళ్ళకూ్కడా ఒక పెద్ద పండుగవచ్చింది. ఒక రోజు సాయంత్రం, పట్టణానికి వెళ్లాలని టింగ్ పో బయలుదేరాడు. ఊరు దాటేసరికి ప్రొద్దుగూకింది! బిక్కుబిక్కుమంటూ, ఒంటరిగా నడుస్తున్నాడు. ఒక స్మశానం దగ్గరకి వచ్చాడు. స్మశానంలో దయ్యాలూ భూతాలూ ఉంటాయి అనిఅంటారు. ఎలాగా అని తనలో తాను అనుకుంటూ, గుండెలుచేత్తో పట్టుకుని నడుస్తున్నాడు.

స్మశానం దగ్గరకి వచ్చింది. అక్కడ ఒక పెద్ద మఱ్ఱిచెట్టు. చుట్టూ పొదలు, చూట్టానికి భయంగావుంది. ఆ చెట్టు కిందికి రాగానే—

'ఎవరునువ్వు?''—అని ఒక భూతం అడిగింది.

టింగ్ పో ధైర్యం తెచ్చుకుని "నువ్వెవరు?'' అన్నాడు.

''నేను భూతాన్ని! నువ్వెవరు?''

"నేనుకూడా భూతాన్నే!''-అన్నాడు టింగ్ పో!

''ఎక్కడికెళ్తున్నావ్?''—

''నేను పట్టణానికి వెల్తున్నాను''

''నేనుకూడా నీతోవస్తాను''—అంది భూతం.

చచ్చేన్రా దేముడా! ఈ భూతం ఇక నన్ను వదలదు కాబోలు అని మనసులో అనుకొని టింగ్ పో--'సరే పద'-అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు. కొంతదూరం నడిచారు-అప్పుడు ఆ భూతంఅందికదా; 'ఏమోయ్! ఇద్దరంకూడా మతితప్పి నడుస్తున్నామేమిటీ! నీవు కొంతదూరం నన్ను మొయ్యి, నేను కొంత దూరం నిన్నుమోస్తాను'- అంది.

సరే, బాగానేఉంది ఉపాయం కాని, నువ్వు నన్ను ముందు మొయ్యి అన్నాడు టింగ్ పో.

భూతం టింగ్ పోని వీపుమీద ఎక్కించుకుంది—కొంత దూరం నడిచింది—



చిన్న అనుమానం వేసింది. దయ్యాలూ భూతాలూ గాలిలో తేలికగా వుంటాయి. టింగ్ పో బరువుగా వున్నాడు!

'ఏంవోయ్! నువ్వు చాలా బరువుగా వున్నావే! నువ్వు నిజంగా భూతానివేనా? లేక మనిషివా? అంది భూతం.

'నిజంగా నేను భూతాన్నే! కొత్తభూతాన్నికదూ అంచేత బరువుగావున్నాను నడు, నడు'-అన్నాడు టింగ్ పో—

ఇంకొంత దూరం పోయాక టింగ్ పో వంతు వచ్చింది. భూతాన్ని మీద ఎక్కించుకున్నాడు కాని మోసినట్టేలేదు. గబగబ నడుస్తున్నాడు.

'ఇదేమిటీ! నువ్వు నడుస్తే చప్పుడవుతోందే! భూతాలు నడుస్తే చప్పుడు కాదు. నువ్వు నిజంగా భూతానివేనా?—అని భూతం అడిగింది.

'అయ్యో! నేను కొత్త భూతాన్ని కదూ! అందుచేత కొంచెం చప్పుడు అవుతున్నది'-అన్నాడు టింగ్ పో.

కొంతదూరం పోయాక ఒక చిన్న కాలువ అడ్డంవచ్చింది. బట్టలు విప్పకుండా భూతం నీళ్లలో



దిగి చప్పుడు కాకుండానే ఒడ్డు చేరింది. పాపం, టింగ్ పో బట్టలన్నీ తడిసిపోయాయి.

భూతానికి ఇంకా అనుమానం వేసింది.

'ఏం భూతం! భయపడుతున్నావా?-పట్టణం వెళ్లబోతున్నావని భయమా?'—అన్నాడు టింగ్ పో.

'అబ్బే! మనుష్యులంటే మనకేమి భయం? మనని చూసి మనుష్యులే భయపడుతారు. వాళ్ళు మనమీద ఉమ్మి వేయకుండా చూడాలి. అంతే'—అన్నాడు భూతం.

ఇంతట్లోకీ పట్నం దగ్గరకి వచ్చింది.

టింగ్ పో తన వీపుమీదున్న భూతాన్ని 'పడిపోతావ్ జాగ్రత్త!' అంటూ మెల్ల మెల్లగా గట్టిగా పట్టుకుంటున్నాడు.

ఎదురుగా పట్నంనుంచి కొందరు మనుష్యులు వస్తున్నారు.

భూతం 'నన్ను త్వరగా దించు మనం మాయమవుదాం' అంది.

కాని, టింగ్ పో యింకా గట్టిగా పట్టుకున్నాడు.

భూతం, గభాలున కిందికి దుమికి తనరూపుమార్చి మేక అయిపోయింది.



టింగ్ పో, వెంటనే ఆ మేక మీద ఉమ్మి వేసేడు. భూతం ఇంక ఆ మేక రూపంలోనే ఉండిపోయింది.

ఆ మేకని టింగ్ పో తాడుతో కట్టి పట్నానికి తీసుకుపోయి బజారులో పాతిక రూపాయలకి అమ్మేశాడు......

ఇదీ కథ—

# బాల నవ్వులా పువ్వులా

బాల నవ్వులూ బజారు నిండే,
నవ్వుల బజారు పువ్వులతోనూ,
పువ్వుల దండలు బాలలతోనూ,
నిండుగ మెండుగ వాసనలల్లేయ్,
బాసల తల్లికి ఊసలు పుట్టక
దిక్కులు చూసిందీ!

* * *

చిట్టి బాల ఒకనవ్వు నవ్వితే,
చిలిపి బాల ఒకపువ్వు విసురుతే,
బాలానందం ఆకాశంలో,
చందమామ కాసిగ్గేలా?

* * *

చిరకాలం వ్రతాలు చేసిన
కలకాలం నోములు నోచిన
ముడుపులు కట్టిన ముత్తైదువ
ఒళ్లో బాలేదీ? బాలేది?
ఒక నవ్వుల బాలని ముద్దాడీ,
ఒక పువ్వుల బాలని లాలించీ,
వెలుగుల బాల నెత్తుకునే
కడుపు చలవల తల్లి
ఆనందం తెలుసా బాలా?

"మహేశ్వర్"

# అంతేకావాలి

'శ్రీవాత్సవ'

రాముడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

'ఎందుకూ వాడిని అలాగ ఏడిపిస్తావు' అని అప్పుడే ఆఫీసు నుంచి వచ్చిన వాళ్ళనాన్న— అమ్మమీద కేకలు వేశాడు.

"నేను ఏడిపిస్తాను" అని వాళ్ళమ్మ ముఖం త్రిప్పుకుని వెళ్ళిపోయింది.

వాళ్ళ నాన్న రాముడిదగ్గరకి వెళ్ళి 'ఎందుకురా నాయనా అలాగ రాగాలుతీసి ఏడుస్తున్నావు' అని కళ్ళ నీళ్ళు తుడుస్తూ అడిగాడు.

రాముడు ఇంకా ఏడుస్తూనే వున్నాడు.

"మీ అమ్మ కొట్టిందా ఏమిటి?"

"లేదు"

"నీకేమైనా కావాలా నేమిటి?"

"నాకేమీవద్దు"

"బిస్కట్లుతింటావా"

"వద్దు"

"బొమ్మలు కావాలా"

"వద్దు"

"ఏవైనా పడగొట్టావా?"

"లేదు"

"ఏదైనా పాడుచేశావా?"

"లేదు"

"మరెందుకుఏడుపు?"

ఎన్ని అడిగినా రాముడు చెప్పడంలేదు.

వాళ్ళ అమ్మ "ఇదిగో చూడండి—ముఖం ఎలాగ గీసుకొ పోయిందో!" అని చూపించింది.

రాముడి ముఖంమీద గాజు పెంకుతో గీక్కి వేసినట్టుయిండ రక్తపుజీరలు

"ఏమిరా! నాయనా! దేనితో గీసుకున్నావు"

అని వాళ్ళనాన్న అడిగాడు.

రాముడు వెక్కి వెక్కి మరింత గట్టిగా ఏడుస్తున్నాడు.

ప్రక్కయింటి శాంత, నన్ను గాజు పెంకుతో గీచింది...ఈ ఈ ఈ" అని రాగాలుతీశాడు.

"ఆడపిల్ల గాజుపెంకుతో గీచితే ఏడవాలా? మగపిల్లలు ఏడవకూడదురా నాయనా?"

అని వాళ్ళనాన్న అన్నాడు.

రాముడికి ఇంకా ఏడ్పు తగ్గలేదు.

వాళ్ళ అమ్మ ప్రక్కయింటి ఆవిడదగ్గరికి వెళ్ళి—రాముడి ముఖంమీద రక్తపుజీరలు చూపించి—

"మీ అమ్మాయి చూశావమ్మా! ఎలాగిల్లిందో" అన్నది.

"మా అమ్మాయి ఎంత మంచిది! వట్టినే ఎందుకు గిల్లుతుంది? మీపిల్లవాడు ఎఱ్ఱతేలులాగ అలాగ ఉంటాడు కాని ఏం చేశాడో" అని ప్రక్క యింటి ఆవిడ అన్నది.

"శాంతా! శాంతా! ఎందుకే పాపం రాముణ్ణికొట్టావట!" అని కేక వేసింది.

శాంత పరుగెత్తుకొనివచ్చి—"నేను కొట్టలేదమ్మా" అని చెప్పి—రాముడికేసి కళ్ళు పెద్దవిగా చేసిచూచింది.

రాముడు ఏడుపు మానలేదు,

ఇంతలో శాంతనాన్న వచ్చాడు. రాముడు ఆయన దగ్గరికెళ్ళి—

"ఏమండోయ్-చూశారండీ మీశాంతఎలాగగిల్లిందోనన్ను" అని ముఖం చూపించి మరింత ఏడిచాడు.

శాంతనాన్న రెండు చపేటాలు వేశాడు శాంతవీపుమీద. శాంత ఏడవలేదు. గప్‌చుప్‌గా లోపలికి పరుగెత్తిపోయింది.

శాంత ఏడవడంలేదని రాముడికి మరింతఉక్రోషంవచ్చింది. తిన్నగా శాంత అమ్మదగ్గరికివెళ్ళి "ఏమండోయి, శాంతని వాళ్ళ నాన్నాగారు కొట్టారండి!"— అని చెప్పాడు.

"అయ్యో! అలాగా!... ఏడమ్మా శాంతా! నిన్ను నాన్నారు కొట్టారా!...ఏదీ—అబ్బా! ఎంతతట్టులేచిందో!" అని అంటూ శాంత తల్లి శాంత వీపుమీద చల్లనిచేతితో మెల్లగా రాసింది.

శాంతకి ఎక్కడలేని దుఃఖం పొంగిపొంగి వచ్చింది.

శాంత బారుమని ఏడ్చింది.

దానితో రాముడి ఏడుపు ఆగింది.

పరుగెత్తుకొని ఇంటికివచ్చి 'అమ్మాయి! శాంత ఏడుస్తోంది!' అని వాళ్ళ అమ్మతో గొప్పగా చెప్పాడు.

# పాపాయి చందురుడు



రచన : శ్రీ కర్రా కాత్యాయిని (బి. ఏ. విద్యార్థిని కాకినాడ)

తల్లి:— ఓహెూ! పాపాయీ!
ఏడవకో పాపాయీ!
అదిగదిగో ఆకొండ
కొండపైన ఆకాశం
ఆకాశంలో చుక్కల్లు
చుక్కల్లో చందురుడు!

పాపాయి:- ఆఁ ఆఁ ఆఁ ఓయమ్మా!
ఆకాశంలో చందురుడు
ఎవరికోసమే తిరిగాడు
గబగబ పరుగులు తీశాడు?

తల్లి:— చూడమ్మా! చందురుడు
చుట్టూఉన్న చుక్కలతో
నల్లటిమబ్బుల మధ్యంలో

దాగుడుమూతలు ఆడాడు
ఏడుపునీవూ మానేస్తే
నీ దగ్గరికీ వస్తాడు!

పాపాయి:- ఏమేమే ఓయమ్మా
చందురుడికీ ఇల్లుందా?
ఉంటే పదవే పోదాము
ఏడుపు నేనూ మానేస్తా!

తల్లి:— అదిగదిగో ఆ అద్దం
అద్దంలోనే చందురిడిల్లు
నడు నడు నడు చూద్దాము

. . . . . . . . . . . . . . . . . . . . .

ఇదుగోచూడిటు అద్దంలో
చందురుడేనా కనిపించేది!

పాపాయి:- ఓహోహోహో! చందురుడు!
ఎంతోచక్కని చందురుడు!!
కిలకిల కిలకిల నవ్వులతో
తళ తళ తళ తళ మెరుపులతో
ముద్దులువచ్చే చందురుడు!
హాహాహా చందురుడూ!!

# దూదిపులి గర్వభంగం

—చాముండీశ్వరి

[అదుగో సావిత్రీ, శకుంతలా, మృణాళినీ, భారతీ, చెల్లాయి—అందరూకలిసి చాముండీశ్వరి యింటికి వెళ్తున్నారు—కొలువు చూడ్డానికి...చాముండీశ్వరి ఇంట్లో]

చాము—రండర్రా మా యింట్లో కొలువు చూద్దురు గాని.

సావిత్రి—ఓ హో!. ఈ యేడు బాగా పెట్టావే కొలువు!

మృణా—ఈ సంవత్సరం అన్నీ కొత్త బొమ్మలు పెట్టేవే!

చాము—అన్నీ కొత్త బొమ్మలు కావు. అదిగో ఆ దూది పులి వుందే— అది మాత్రం కొత్తగా కొన్నాను.

భారతి—ఆ పులి బొమ్మ దూదితో చేశారా!...ఎంత బాగుందో!...అబ్బ నిజంగా పులిలాగే వుంది.

చాము—నా కొలువులో బొమ్మలు మాట్లాడుతాయి తెలుసా?

శకుం—(నవ్వుతూ) అదేమిటీ! బొమ్మలు ఎక్కడైనా మాట్లాడుతాయా?

చాము—అవును. కావలిస్తే చూడండి—ఇప్పుడు నా బొమ్మలచేత ఒక చిన్న నాటకం వేయిస్తాను...

ఈ నాటకంలో వచ్చు పాత్రలు

తల్లి బొమ్మ
పిల్ల బొమ్మ
చందనం బొమ్మ
గాజు పిల్లి బొమ్మ
బాతు బొమ్మ
దూది పులి బొమ్మ

[మొదటి రంగం]

కొలువులో

(తల్లి బొమ్మ—పిల్ల బొమ్మ)

పిల్ల—(ఏడుస్తూ) ఊఁ...ఊఁ...

తల్లి—ఎందుకు బాబూ ఏడుస్తున్నావు?...ఏం కావాలి?

పిల్ల—నాకు బొమ్మ కావాలి యీా యీా యీా యీా...

తల్లి—ఇంద—ఈ బాతు బొమ్మ తీసుకో

పిల్ల—నా కక్ఖర్లేదూ ఊ ఊ ఊఁ...

తల్లి—పోనీ—ఇంద—ఈ గాజు పిల్లితో ఆడుకో—

పిల్ల—అబ్బ! నా కక్కర్లేదూ ఊ ఊ ఊఁ —

తల్లి—అయితే నీకే బొమ్మ కావాలీ?...ఇంద...ఈ చందనపు బొమ్మ కావాలా?...చూడు ఎంత బాగుందో!...దీనితో ఆడుకో—

పిల్ల—అబ్బ! నా కొద్దూ ఊ ఊ ఊ ఊ—

తల్లి—అయితే మరే బొమ్మ కావాలో చెప్పూ!

పిల్ల—నా కల్లా బొమ్మ కావాలీ యీ యీ యీ!

తల్లి—ఏది—ఆ ఏనుగా?

పిల్ల—కాదు.

తల్లి—ఆ పులి బొమ్మా

పిల్ల—ఊ—అదే—అదే—

తల్లి—ఇంద—జాగ్రత్తగా ఆడుకో—ఇంక ఏడవకు—

[రెండవ రంగం]

## బొమ్మల సభ

[బాబు ఆ రోజంతా ఆ దూది పులి బొమ్మతోటే ఆడుకున్నాడు. అది చూచి—పాత బొమ్మ లన్నిటికీ కోపం వచ్చింది—ఆ రాత్రి పాత బొమ్మలన్నీ సభ చేశాయి—సభలో చందనం బొమ్మ మాట్లాడు తుంది.]

చంద—సోదర సోదరీ బొమ్మలారా! ఇప్పుడు చూశారా మన గతి! ఇన్నాళ్లూ ఈ ఇంటి అబ్బాయి మనతో ఆడుకొని, ఇప్పుడు, కొత్తగా ఈ పెద్ద పులి బొమ్మ రాగానే మనతో ఆడుకోడం మానేశాడు—ఇది ఏమేనా బాగుందా?—ఏం, బాతు బొమ్మా—నువ్వేమిటంటావు?

బాతు—క్వాక్...క్వాక్...క్వాక్...చిట్టి బొమ్మలారా! పొట్టి బొమ్మలారా! నిజమే! చందనం బొమ్మ చెప్పిన మాట నిజమే! ఈ పెద్ద పులి బొమ్మ వచ్చిన దగ్గర నుండీ ఆ అబ్బాయి మన జట్టు విప్పేశాడు. అంతే కాకుండా కొడుతున్నాడు కూడానూ! మొన్న నేను ఆడుకోడానికి వెళ్తే, నన్ను పట్టుకొని విసిరేశాడు...చూడండి నా ముక్కు ఎలా చితికి పోయిందో!

చంద—బాతు బొమ్మా—ఇంకా నయం...నిన్ను సెలులాయిడుతో చేయబట్టి నీ ముక్కు చితికి పూరుకుంది గాని విరిగి పోలేదు... నేను కొయ్య బొమ్మనవడంవల్ల నాగతి చూశావా! మొన్నను ఆ అబ్బాయి నన్ను విసిరి కొట్టే సరికి, నా కుడిచేతి రెండు వేళ్లూ, ఎడంచేతి రెండు వేళ్లూ విరిగి పోయేయి...ఏదో మొండిదాన్ని గనక

ఇలా బతికి వున్నాను గానీ—ఉ(—ఊ(—ఊ(—(ఏడుపు)

(మ్యావ్ ! మ్యావ్ ! మ్యావ్ !)

బాతు—అదుగో. పిల్లి బొమ్మ ఏదో మాట్లాడుతోంది—

పిల్లి—ఏడవకు చందనం బొమ్మ! ఏడవకు! నాగతి చూడు...నన్ను మొదట ఆ అబ్బాయి కొన్నప్పుడు—నేను రంగు రంగుల గాజు పిల్లినని, నన్ను ఎంతో ముద్దగా చూసేవాడు—ఇప్పుడు ఈ పులి బొమ్మ వచ్చింతరువాత నన్ను చూస్తే యిష్టమే లేదు... నన్ను విసిరి కొట్టేశాడు చూడు, నా కుడిచెవి ఎగిరి పోయింది...నా తోక తెగిపోయింది—నా నెత్తి చూడు ఎన్ని పెచ్చులు వూడి పోయాయో! మళ్ళీ నన్ను అలా విసిరి కొడితే నేను ముక్కలు ముక్క లయిపోతాను... నాకు అదే భయం...(ఏడుపు)

నక్క—సోదర సోదరీ బొమ్మలారా! మనం ఇప్పుడు ఏడుస్తే లాభం లేదు—కొత్తగా వచ్చిన ఈ పెద్ద పులి బొమ్మ మూలాన్న మనకి ఇన్ని కష్టాలు వస్తున్నాయి. అంచేత, మనం ఈ పెద్ద పులిని ఎలాగేనా వెళ్ళగొట్టాలి.

చంద—ఉస్!...అదుగో—పెద్ద పులి ఒస్తోంది—

పిల్లి—ఉండండి—నేను పలకరిస్తాను...పెద్ద పులి గారూ! ఏవండోయ్! దూది పులిగారూ! ఇటూ, ఇటూ రండి! రండి!

పులి—హూ(—

పిల్లి—యేవండోయ్ పెద్ద పులి గారూ! అయ్యో మాట్లాడరేమీ?

పులి—నేను మాట్టాడను—నేనెక్కడ? మీరెక్కడ? మీరందరూ పాత బొమ్మలు—నేను సరికొత్త దూది పులిని నేను అబ్బాయితో ఆడుకోవాలి...నే నిక్కడ వుండను... హూ(...(పులి గర్వంగా వెళ్ళిపోతుంది)

పిల్లి—అబ్బో! ఈ పులికి ఎంత గర్వంగా వుంది!

నక్క—ఈ దూది పులికి గర్వ భంగం చేయాలి—

బాతు—అవును—నిజమే—ఈ పులికి గర్వ భంగం చెయ్యాలి—నేనొక ఉపాయం ఆలోచించెదను—

పిల్లి—యేమిటా వుపాయం?

బాతు—ఇది వర్షాకాలం కదూ? రేపు సాయంత్రం వర్షం కురుస్తుంది—కురిసే ముందు మనం అందరం కలిసి, ఆ దూది పులిని షికారు తీసుకు వెడదాం—అప్పుడు ఆ వర్షంలో దానికి గర్వభంగం అవుతుందిలే—

పిల్లి—అవును—నీ ఉపాయం చాలా బాగుంది రేపు సాయంత్రం అందరం కలుద్దాం—

[మూడవ రంగం]

తోటలో

[ఆ మర్నాడు సాయంత్రం—పాత బొమ్మలన్నీ కలిసి, దూది పులిని షికారు తీసుకు వెళ్లేయి]

బాతు—క్వాక్ క్వాక్ క్వాక్—

పిల్లి—యేం బాతూ! చాలా సంతోషంగా వున్నావే!

బాతు—అదుగో! ఆ మేఘాలు చూడు!...ఇప్పుడు చక్కావర్షం కురుస్తుందిచల్లగా... క్వాక్ క్వాక్ క్వాక్

(వర్షం)

పులి—అయ్యో, తడిసి పోతున్నాను. వర్షం! వర్షం!—

చంద—యేం దూది పులీ! వర్షం బాగుందా?

పులి—అయ్యో! తడిసి ముద్దయి పోతున్నానర్రా! నడవ లేకుండా వున్నాను—

నక్క—అయ్యో పెద్ద పులీ! ఇంతేనా?

పిల్లి—అయ్యో దూది పులీ! ఇప్పుడు నీ రంగులన్నీ యేమయేయ్?

పులి—అయ్యో! నా రంగంతా నీళ్లలో కరిగి పోయింది—నా రూపంతా మారి పోయింది!

పిల్లి—అయ్యో కొత్త పులీ, నీ బడాయి అంతా ఇంతేనా? మేం పాత బొమ్మలం అయినా, మా రూపు చెడి పోలేదు—నువ్వు కొత్త బొమ్మవి—బాబుకి ముద్దు బొమ్మవి—నీకేం లోపం? —పద పద—ఇంటికి పద—

[నాల్గవ రంగం]

ఇంట్లో

పిల్ల—అమ్మా! బొమ్మ కావాలే—

తల్లి—అదుగో నాయనా—నీ దూది పులితో ఆడుకో—

పిల్ల—ఛీ! ఆ బొమ్మ నాకొద్దు—రంగులన్నీ పోయేయి. ముద్దయి పోయింది

తల్లి—పోనీ, యీ చందనం బొమ్మ, బాతు బొమ్మ, పిల్లి బొమ్మ, వీటితో ఆడుకో—

పిల్ల—అలాగే

(చప్పట్లు)

భా—బాగుంది చాముండేశ్వరీ మీ బొమ్మల నాటకం—

శకుం—పెద్ద పులి గర్వ భంగం బాగా అయిందిలే!—



దురిశేటి
చాముండీశ్వరి
కొలువులో

ఆ గూట్లో కూర్చున్న
అమ్మాయి కాదు ఒ
బొమ్మ ఆ గదినూల
కొండా, కొండమీద కో
విలా, గోద్దూ బలేతమా
షా గా వున్నాయి కదూ



నాకు పాటొచ్చు—హా
ర్మోనియం కూడా వాయి
స్తాను—అంటుంది యీ
అమ్మాయి — బొగ్గవరపు
వీరరంగవల్లి కుసుమ
కుమారి —(కాకినాడ.)



# కోతిపిల్ల

రచన :

అనగనగా ఒకవూరు
ఆవూరిమధ్య నొక చెరువు
ఆ చెరువుగట్టు నొక చెట్టు
ఆ చెట్టుమీద నొక కోతి
ఆ కోతికున్న దొక పిల్ల.

ఓనాడు ఆకోతిపిల్ల ఏంజేసిందంటే—

తల్లి ఎచటికో పోగానే
చెరువునీటిలో దుమికింది
ములిగి తేలుచూ ములిగింది
తేలిములుగుచూ తేలింది
ఎన్నోగంటలు గడిపింది.

ఆ సమయంలో ఏమయిందంటే—

చెరువులోని చిరుచేపొకటి
తళుక్కుమంటూ పైకొచ్చి
ఎగురుచు గంతులు వేసింది
కోతీ దానిని చూచింది
చూచినవెంటనె పట్టింది

అప్పుడు ఆ చేపపిల్ల గిజగిజ కొట్టుకుంటూ ఏమందంటే—

ఆగుము ఆగుము ఓ కోతీ!
తొందర ఎందుకు ఓ కోతీ!
నీకోసమెగద ఓ కోతీ!
నేనిటువస్తిని ఓ కోతీ!
నన్నువిడువుమా ఓ కోతీ!

నాకేమైనా ఇస్తేనే కాని నిన్ను విడవనని కోతిపిల్ల పట్టుపట్టేసరికి చేపపిల్ల ఏంచెప్పిందంటే—

అదిగదిగో అటుచూడు
ఆ తెల్లనినురగల పొంగులపై
ఎత్తుగ ఉబ్బే కెరటాల్పై
పరుగులుతీసే పేపరుపడవ
అదిగదిగో అటుచూశావా?

# ముత్యాలు



"ప్రభాకర్"

వెంటనే కోతిపిల్ల తొందరగా
ఆ పడవలో ఏముంది చెప్పు
అంటూ ఆ చేపపిల్లను ఒక్క
నొక్కునొక్కేసరికి అది 'కుంయి'
మంటూ ఒక్క అరుపు అరిచి
ఏమందంటే—

ఆ పడవలోవున్నది పాపాయి
పాపకు మెడలో ముత్యాలు
తళతళ మెరయుచు ఉన్నాయి
నన్నుమించినా అందమైనవి
నన్నువదలితే తెచ్చియివ్వనా!

అనేసరికి కోతిపిల్ల గంపెడంత
ఆశతో చేపపిల్లను విడిచిపెట్టి
తనకు కొన్ని ముత్యాలు తెచ్చి
ఇమ్మని అడిగింది. అప్పుడు చేప
పిల్ల ఏంచేసిందంటే—

చెంగున గంతొక టేసింది
బుడుంగుమంటూ మునిగింది
దూరముగానూ తేలింది
హాహాహాయని నవ్వింది
నవ్వుచు మునుగుచు తేలింది
తేలుచు మునుగుచు పోయింది!

* * *

కోతిపిల్ల కడుదుఃఖముతో
గట్టునుచేరుచు ఏడ్చింది

ఇంతట్లోకి ఏంజరిగిందంటే—

తల్లికోతి యపుడొచ్చింది
పిల్లనుపిలిచీ దగ్గిరికి
తెల్లని పేలాలిచ్చింది!
కోతిపిల్లకవి ముత్యాల్లా
ఎంతో సంతసమిచ్చాయి!!



# మిఠాయి మేజిక్కు

రచన: శ్రీ పాలంకి వెంకటరామచంద్రమూర్తి

ఆదినం మా బడికి పుట్టిన రోజు. మేమంతా సరదాగా చెయ్యాలని నిశ్చయించాం. నా పేరు 'డ్యాన్సు'లో వేసుకున్నారు. మా కామాక్షి పాడతానంది. రంగడూ వాళ్ళూ ఓ నాటకం తలపెట్టేరు. 'నువ్వేమిచేస్తావురా?' అని టీచరు ప్రకాసిగాణ్ణి అడిగారు. వాడు ''మిఠాయి మేజిక్కండీ!'' అన్నాడు.

ఈ మేజిక్కు ఏమిటో మా కెవళ్ళకీ తెలిసిందికాదు. మా రంగడు ప్రకాసిని అడిగి చూశాడు కాని వాడు గప్‌చిప్‌గా ఊరుకున్నాడు.

మా డ్యాన్సులూ, ఆటలూ పాటలూ అయిపోయాయి. భేష్! అంటే భేష్ అని వచ్చినవాళ్ళంతా మెచ్చుకున్నారు. ఇంక ప్రకాశరావు మేజిక్కు మిగిలింది.

రంగంమీద ఓ టేబిలు వేశారు. దానిమీద ఓ తెల్లటి గుడ్డ పరిచారు. తెల్లవాడిటోపీ ఒకటి అందుమీద పెట్టేరు. దాని ప్రక్కనే లడ్డువుండ ఒకటి తెచ్చి ఉంచారు. లడ్డు చూడ్డంతోటే మా రంగడికి నోరూరింది!

తటాలున సైడుకర్టెనులోంచి ప్రకాసిగాడు ఇంద్రజాలకుని వేషం వేసుకు తయారయ్యాడు. ముఖమల్ వేస్టుకోటు, దానికి తగిలించిన రోల్డుగోల్డు మెడల్సు, మూతిమీద అంటించిన మీసాలూ, కాబూలివాడిలాగు, షరా యి-మంచి బా..గా తయారయ్యాడు. మేమే మొదట ఆనమాలు పట్టలేకపోయాం.

'ఆర్యులారా! నేను ఇప్పుడు చేయబోయే యీ మేజిక్కు హిమాలయ పర్వతములకు పోయి గొప్పగొప్ప యోగులవద్ద శిష్యరికము చేసి ...ర్చుకొన్నది.' ఈ విధంగా ...భించి ఐదునిము షాలు అద ...ంగా లెక్చరుకొట్టి, ప్రకాశరావు 'అయ్యా మీలో ... యెవరైనా ఒకరు ఇక్కడకు రావలెను' అన్నాడు. మా రంగడు రంగస్థలంమీదకు వెళ్ళేడు, ఆశతో.

'అబ్బాయీ, ఈ మేజాపైన ఏమున్నది?'

'మిఠాయి ఉండ'

'ఇంకా ఏమున్నది?'

'దొరటోపీ'

'ఆటోపీ మిఠాయిఉండ పైన బోర్లించు'

రంగడు బోర్లించాడు

'అబ్బాయి—నీవు దొరటోపి ముట్టకుండా దానిక్రింద ప్రస్తుతం మనకు కనబడకుండా ఉన్న మిఠాయిని తీయగలవా?'

రంగడు 'టోపీ ముట్టుకోకుండా తీయటం ఎలాగా?' అన్నాడు.

'అశక్తికే హిమాలయ పర్వతాలలోని యోగుల సేవ చెయ్యాలి! చూడు నేను టోపీ ముట్టకుండా మిఠాయి ఎట్లా తీయ

కలనో!'' అంటూ ప్రకాశరావు మేజా చుట్టూ మూడుమార్లు ప్రదక్షిణం చేశాడు. 'హ్రాం, హ్రీం, హ్రూం, హ్రేం' అని మంత్రం చదివి, టోపీదగ్గర చెయ్యిపెట్టి పిడికిలిమూసి, నోటి వద్దకు తెచ్చుకొని 'ఇదిగో మిఠాయి తినేస్తున్నా!' అం[illegible] ఎదో నమిలి మింగుతోన్నట్లు నటించాడు.

'అంతా ఉత్తది. నువ్వు మిఠాయి తియ్యనేలేదు!' అన్నాడు రంగడు.

'నా మహిమ ఉత్తదంటావా? కావలస్తే, టోపీఎత్తి చూడు. అక్కడ మిఠాయి ఉందేమో!'

రంగడు టోపీ ఎత్తాడు. మిఠాయిఉండ చెక్కు చెదరకుండా పెట్టినచోటే ఉంది!

కాని అది అక్కడ మళ్లీ క్షణంలో లేదు. ప్రకాశిగాడు దాన్ని తీసుకుని నోట్లో వేసుకుని నమిలి మింగేసాడు.



చిరంజీవులు,

ప్రభావతి—భానుమతి

ఒకమ్మాయి చక్కగా మృదంగం వాయిస్తే మరొకమ్మాయి కంజీరా బాగా వాయిస్తుంది. ఈ అక్కచెల్లెళ్లకు యీమధ్య బెజవాడలో జరిగిన 3 వ ఆంధ్రరాష్ట్ర పత్రికా సంపాదక సభలో బంగారు పతకాలు బహుమతులిచ్చారు.

---

రంగడు 'ఇదట్రా నీ మేజిక్కూ!' అన్నాడు.

'టోపీ నేను ముట్టుకోకుండా మిఠాయి [illegible] లేదా?' అంటూ ప్రకా[illegible] నవ్వుతూ తెరలోకి వెళ్ళిపోయాడు. అర్థ[illegible]రుతా చప్పట్లు కొట్టేరు. [illegible]

# నాన్నమ్మ పాటలు

## పొలాని కెళదాం

పొలాని కెళదాం
పొలాని కెళదాం—
గరికె పువ్వులూ
కందికాయలూ
కోసుకువద్దాం—
చెట్లనీడలో
చలుదులు తిందాం—
చెరువుగట్లపై
పరువులు పెడదాం—
పచ్చనిచేల్లో
పిచ్చిక ఈకెలు
తెచ్చి అల్లుదాం
కుచ్చులటోపీ—
రావే రావే నాన్నమ్మా!
లేవే లేవే నాన్నమ్మా!

—దేశిరాట్—వి—రాట్




# బుజ్జాయి

బుజ్జాయి—పేరు చాలా ముద్దుగా వుందికదూ—ఇది యీ అబ్బాయి అసలు పేరు కాదు. అసలు పేరు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి. తన పెదతండ్రిగారి పేరు పెట్టుకున్నాడు. తన పెద తండ్రిగారు గొప్పకవి. అంచేత తనుకూడా పెద్దకవి అవబోతాడన్నమాట.

అసలు యీ అబ్బాయి నాన్నగారు ఎవరో తెలుసా? అతను కూడా గొప్పకవే. మహాకవి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి పేరు మీరు వినేవుంటారు.

మన 'బుజ్జాయి'కి ఇప్పుడు 12 ఏళ్లు. చిన్న కుర్రాడయినా ఊహలు చాలా పెద్దవి. బొమ్మలు గీయడం అంటే చాలా సరదా.

ప్రక్క పేజీలో 'బాలుడు-జండా' బొమ్మ, బుజ్జాయి వేసినదే. మన 'బాల' పత్రిక చూచి, తనకి యీ బొమ్మ వెయ్యాలని బుద్ధిపుట్టింది.

'అన్ని రాజ్యాల వారికి జండా లున్నాయి; మా బాలుర రాజ్యానికి జండా 'బాల పత్రిక'. ఈ 'బాలపత్రికను' హస్తాన్ని ధరించిన వారంతా, ప్రతిబాలుడూ ఒక బాలచంద్రుడవుతాడు...' అని అన్నాడు యీ బొమ్మగీస్తూ.

అరగంటలో వేశాడు ఈ బొమ్మని.



బుజ్జాయి

బుజ్జాయి ఇంకా ఎన్నో బొమ్మలు రాశాడు. ఏ మనిషిని చూపి, బొమ్మ వేయమన్నా పది నిముషాల్లో తీర్చి దిద్దిన రేఖా చిత్రం వేసి చూపుతాడు.

ఒక్క బొమ్మ వేయడమే కాదు. చాలా బాగా పాడుతాడు కూడాను.

బుజ్జాయికి తన తండ్రిగారి దగ్గర ఎక్కువ చేరిక. తండ్రి కృష్ణశాస్త్రిగారు చెప్పే గొప్ప గొప్ప వీరులకథలూ అవీ ఎంతో శ్రద్ధగా వింటాడు

మన తెలుగు పిల్లలందరూ "బాలచంద్రుడు" వలె గొప్ప గొప్ప వీరులవాలంటాడు మన బుజ్జాయి.

—శ్రీరంగం నారాయణబాబు

---



# వెలుగు పాపాయి

వెలుగు లన్నిటిలోను వెల్గేది చెప్పుడు
మా ఇంట పాపలూ తిరుగంగ వెలుగు;
నవ్వు లన్నిటిలోను - ఏనవ్వు వెలుగు
మా ఇంట బాలల్లు - నవ్వంగ వెలుగు;
ఆట లన్నిటిలోను - ఏఆట వెలుగు
మాయింట పాపల్లు - ఆడంగ వెలుగు,
పల్కు లన్నిటిలోను ఏపల్కు వెలుగు
మా ఇంట బాలల్ల పల్కులే వెలుగు;
ఇంటింట ఇంటింట ఏవెలుగు వెలుగు
ఇంటింట ఇంటింట మా "బాల" వెలుగు!

రచన—రాయవరపు రామస్వామి,
ఏటికొప్పాక.

# ఆరోగ్యవాచకము

## మొదటి తరగతి

[డాక్టర్ పోలాకి శ్రీనివాసరావు

### ఆరోగ్యము

I

రోగము లేనిది ఆరోగ్యం
రోగము గలది అనారోగ్యం

II

భోగాలు కావాలి
రోగాలు పోవాలి
జీవాలు నిలవాలి
ఏ వేళ గావాలి

ఆరోగ్యం—మంచి—ఆరోగ్యం

III

ఆరోగ్యమును మించు సంపదే లేదు
ఆరోగ్యమును మించు బంధువే లేదు
ఆరోగ్యమును మించు సౌఖ్యమే లేదు
ఆరోగ్యమును మించు నట్టిదే లేదు.
మంచి గాలిని బీల్చ నారోగ్యం
మంచి నీటిని త్రాగ నారోగ్యం
మంచి తిండిని దినగ నారోగ్యం
మంచి చోటను దిరుగ నారోగ్యం.

# తిండి



ఈగ వ్రాలని తిండి

మాగి కుళ్లని తిండి

మేలి పాత్రల నుండి

వేళ లోపల తిండి

ఆరోగ్యం—మంచి—ఆరోగ్యం !

# పకపకలూ పెకపెకలూ

అతడు పటపట పళ్ళుకొరికెను.
అతడు మటమట మండిపడెను.
అతడు కటకట యని దుఃఖించెను.
జనులు కిటకిట లాడుచుండిరి.
నీవు బొటబొట కన్నీరు కార్చితివి.
నేను లొటలొట లొట్టలు వేసితిని.

వాళ్ళనాన్న వాణ్ని బరబర లాక్కుపోయెను.
నీవు అంపముతో దానిని పరపర కోసితివి.
అతడు చరచర నడచిపోయెను.
కట్టెపుల్ల సురసుర మండుచుండెను.
ఆయన గురగుర గుర్రుపెట్టు చుండెను.
నేను కరకర నమిలితిని.
నీ ముక్కులో బురబుర లాడుచున్నది.

వాడు పకపక నవ్వినాడు.
నీవు వికవిక నవ్వితివి.
నేను చకచక పోయితిని.
వాడి బూట్లు టకటక మనుచుండెను.

ఆమె వలవల ఏడ్చెను.
నేరేడుపళ్ళు చెట్టునుండి జలజల రాలెను.
పాపని కాలిగజ్జలు గలగల మోగెను.
నీ ముఖము కలకల లాడుచున్నది.
మన "బాల" కిలకిల నవ్వుచున్నది.

# రెండు వైపులా చూడాలి!

ఇటూ



అటూ

ఈ ఇద్దరూ కలసి పనిచేస్తే మనకి స్వరాజ్యం!

బొమ్మ వేసినవారు: జి. గోపాలకృష్ణమూర్తి
గుంటూరు



# ఇంపులూ సొంపులూ హిమాలయాలు

శ్రీ అడపా రామకృష్ణారావు

[మన అమ్మ మనకు పాలిచ్చి పెంచుతుంది. ఒళ్ళో పండుకో బెట్టుకుని లాలిస్తుంది. అదే విధంగా మన భూమి కూడా మన కోసం పంటలు పండించి పోషిస్తుంది. ఉండేందుకు చోటు నిచ్చి కాపాడుతుంది. అందుకే మన అమ్మ మన కెంత ముఖ్యమో మన భూమి కూడా—అంటే మన దేశం కూడా మన కంత ముఖ్యమైన దన్నమాట.

ఏ దేశం మనది?—భారతదేశం. మన దేశాన్ని గురించి కొన్ని వేల సంవత్సరాలనుంచీ కూడా దూర దేశాల ప్రజలు "స్వర్ణ భారతి" అని పిలుస్తూ ఎన్నో చిత్ర విచిత్రమైన కథలు చెప్పుకునే వారు. "స్వర్ణ భారతి" అంటే 'బంగారపు భారతదేశం' అని అర్థం. అంటే మన దేశం పాడి పంటలతో, అంద చందాలతో బంగారమల్లే వుందని వాళ్ళ అభిప్రాయం. నిజంగా మన దేశం అనేకమైన అంద చందాల దృశ్యాలతో తీర్చి దిద్దిన రత్నాల రంగవల్లివలె కలకలలాడుతూ వుంటుంది. ఐతే అందమంతా ఒక్క చోటే కరుడు కట్టుకు కూచుంటుందా? ఒకచోట ఒక విధమైన సొగసు—మరోచోట మరో విధమైన సొంపు. ఐతే ఈ ఇంపు సొంపులన్నీ ఎక్కడెక్కడ పీఠం వేసుకుని కూచున్నాయో మన "బాల" లో నెలనెలా చూద్దాం.]

వెనకటికి ఒకాయన చైనాదేశంనించి మన దేశపు అందమూ, చందమూ అచ్చటా, ముచ్చటా, చూచిపోదామని చక్కావచ్చాడు. మనదేశమంతా తిరిగి, చూడవలసిన దృశ్యాలన్నీ చూసి మళ్ళీ తనదేశం చేరుకున్నాడు. అక్కడి వాళ్ళంతా ఆయనచుట్టూచేరి "ఏం చూసి వచ్చావయ్యా భారతదేశంలో?" అని

అడిగారు. "అబ్బో-ఒకటేమిటి చాలా చూశాను." అన్నాడాయన. "ఐతే అన్నీ మాకుచెప్పాలి" అన్నారువాళ్ళు. "సరే-హిమాలయ పర్వతాలుచూశాను." అని మొదలుపెట్టాడు. మనదేశాన్ని గురించీ, దాని అంద చందాలను గురించీ మాటామంతీ చెప్పుకునే టప్పుడు ఎవరికైనా మొదట జ్ఞప్తికి వచ్చేవి హిమాలయ పర్వతాలే.

"హిమము" అంటే "మంచు" అని అర్థం. తెల్లవారగానే మనం లేచి నప్పుడు పచ్చగడ్డిమీదా, లేత లేత చిగు రాకులమీదా మిలమిలా మెరుస్తూ, ఒయ్యారంగా జారుతూవుండే మంచు చినుకులు మీరు చూసివుంటారు. ప్రపంచంలో అన్ని పర్వతాలకన్న ఈ హిమాలయాలు చాలా ఎత్తైనవి కావడంచేత రాత్రికురిసిన మంచు ఈ పర్వతపు చివళ్ళమీద కమ్ముకుని తెల్లగా—వొదినమ్మ జడలోని మల్లెమొగ్గల మాదిరిగా తళతళలాడుతూ వుంటుంది. ఒకవేళా పాళా అంటూలేకుండా ఆపర్వతాలమీద మంచు ఎప్పుడూ మిలమిలా మెరుస్తూనే వుంటుంది.

తెలుపురంగు మనకు మొదటినించీ ఇష్టం. చదువుకోడానికి కూచున్నప్పుడు మొదట సరస్వతీదేవిని ప్రార్థించేటప్పుడు కూడా "యాకుందేందు తుషారహార ధవళా" అని—అంటే "మల్లెమొగ్గల మల్లేనూ, మంచుచినుకుల మల్లేనూ నీవు తెల్లటి తల్లివమ్మా" అని చెప్పుకుంటాము. ఏమచ్చా, మాపూలేకుండా తెల్లగా పాలతేటవలె వుండే వస్తువుల్ని చూడడానికి యెంతో ఆనందంగా వుంటుంది. పైగా చల్లదనమంటేకూడా మనకు చాలాయిష్టం. అందుకే మనం పూజా పురస్కారాలలో మంచిగంధాన్ని తరచుగా వుపయోగిసాము. హిమాలయాలకేమో ఈరెండు శుభలక్షణాలూ వున్నై. అంటే తెల్లదనమూవుంది—చల్లదనమూ వుంది. ఔనా?

అందుకే హిమాలయాలంటే మన కెంతో గౌరవం: ఎంతో ఇష్టం!

చీకటి చెదరిపోతూ, అప్పుడే తెల తెలవారుతూ వున్నప్పుడు చూడాలి హిమాలయాల సొగసు. నల్లటి మేలి ముసుగులోనుంచి తెల్లటి ముఖం కని పిస్తే ఎట్లావుంటుంది? ఆవిధంగా చీకటి నలుపు తొలగిపోతే మధ్య శుభ్రంగా చంటిపాప చిన్నారి నవ్వుమల్లే వెలిగే ఆ పర్వతాలనుచూస్తే ఇక అక్కడి నుంచి కదిలి వెళ్ళాలనిపించదు. ఇంక ఉదయించినకొద్దీ ఇక్కడొక కిరణం, అక్కడొక కిరణం జిగేల్ జిగేల్ మని సూర్యుడు మెరుస్తూ మాయమౌతూ, మెరుస్తూ మాయమౌతూ వుంటే బలే బాగుంటుంది.

ఇక వెన్నెల రాత్రివేళ సరేసరి—చందమామ ఆకాశంనించి కోరికోరి వెన్నెల కురియిస్తూవుంటే తెల్లటి హిమాలయాల వన్నె చిన్నెలన్నీ బంగారమల్లే మారిపోయి నిమిష నిమిషానికీ చెదురుతూవుంటే ఆకాశంనించి అప్సరసలు దిగివచ్చి ఈ పర్వతంమీద దాగుడుమూత లాడుకుంటున్నారేమో—అనిపిస్తుంది. వొదినమ్మ జడలోని జాజి పువ్వులూ, పసిపాప ముత్యాల చిరువవ్వులూ—ఏవీ చాలవు ఆచక్కదనం చెప్పడానికి.

సూర్యుని వేడికి ఒక్కొక్కప్పుడు కొంచంగా మంచుకరిగి జలజలా పాకుతూ కిందకు దొర్లి దొర్లి పరుగులు తీస్తూవుంటే ఎంతో బాగుంటుంది. అటువంటి పిల్ల కాలవల్ని "హిమానీనదాలు" అని పిలుస్తారు. ఇటువంటి కాలవ పిల్లలేకాకుండా పెద్దపెద్ద నదులుకూడా ఈ పర్వతాలలో పుట్టి దేశంమీద ప్రవహించి ఎన్నోపంటలు పండించి మనకింత తిండి పెడుతున్నవి. ఈ నదులన్నింటిలో పెద్దది గంగానది. మన దేశమంతటికీ ఇది ముఖ్యమైన నది.

అసలు గంగానది మొదట్లో ఆకాశంలో వుండేదట. భగీరథుడనే ఒక ఋషి తన తాత ముత్తాతలకు పుణ్యం కలగడానికి ఈనదిని మన లోకంలోకి రప్పించాడట. అదంతా ఒక చిత్రమైన కథ.

హిమాలయ ప్రాంతాలలో చక్కటి దేవదారు అడవులుకూడా వున్నై. ఇక మొక్కలూ సరే సరి. క్రూర మృగాలుకూడా వుంటాయి ఆ అడవుల్లో.

హిమాలయాలలో అన్నిటికన్న ఎత్తైనది గౌరీ శంఖర శిఖరం. దీనిని "మౌంట్ ఎవరెస్టు" అని పిలుస్తారు కూడాను. ప్రపంచంలో కొందరు చురుకైన కుఱ్ఱవాళ్ళు బయలుదేరి ఏంచేశారంటే ఎత్తైన ప్రతి పర్వతమూ చివరి కంటా కాలినడకనే యెక్కేసి చక్కావచ్చారు. ఐతే ఈ ఎవరెస్టు శిఖరం దగ్గఱ మాత్రం వాళ్ల ఆటలు సాగలేదు. ఇది మంచుతో కప్పబడి వుంటుంది కనుక ఈ పర్వతాన్ని ఎక్కడం దుస్సాధ్యం. ఇంతవఱకూ ఈ శిఖరం పైవఱకూ అంటుకుని తిరిగివచ్చినవాళ్లు లేరు. ఐనా కొత్తగా వెళ్ళేవాళ్లేమో వెడుతూనే వున్నారు. ఎలాగైనా ఎవరెస్టు శిఖరాన్ని గెలిచా మనిపించుకోవాలని చేసే ప్రయత్నాలేమో చేస్తూనే వున్నారు. "ఏనాటికైనా నీ అంతు కనుక్కోవలిసిందే" అంటున్నారు వాళ్లు. కాని ఆశిఖరంమాత్రం "మీతరంకాదు పొండి" అని ఎగతాళి చేస్తున్నట్టుగా నిశ్చలంగా నిలబడివుంది.

ఇక్కడికి రకరకాల మనుష్యులు వస్తూవుంటారు. సాధువులూ, సన్యాసులూ ఆశ్రమాలు వేసుకుని హృషీకేశం, బదరీ నారాయణంవంటి చోటుల్లో కనిపిస్తారిక్కడ. ఇక హిమాలయాల అచ్చటా ముచ్చటా చూసిరావాలని బయలుదేరేవాళ్ళు అనేకులు. కొందరు జబ్బుమనుషులుకూడా యీ కొండ చాయనే కొన్నాళ్లుంటే రోగాలు నయమవుతాయని యిక్కడికి వచ్చివుంటారు. ఇక ఈ కొండల్లో కలకాలమూ కాపురముండే కొండజాతివారుకూడా వున్నారు. అన్నట్టు "సిమ్లా" అన్న పేరు మీరెప్పుడేనా విన్నారా? మన రాజప్రతినిధిగారు వేసవికాలం ఢిల్లీలో వేడిభరించలేక సంసారమంతటితో సిమ్లా కొండలమీదికి వెళ్ళి కొన్నాళ్ళపాటు మకాంచేసి వస్తారు. ఆ సిమ్లా కొండలుకూడా హిమాలయాలకు చెందినవే. మొత్తం మీద ఈ మంచు కొండలు ఎంతదూరభారమైనా రోజూ ఎవరో ఒకరు వస్తూపోతూ వుండటంచేత ఎప్పుడూ మనుష్యులతోనూ, మృగాలతోనూ, తళతళా మెరిసే మంచుతోనూ, నవనవలాడే దేవదారు వనాలతోనూ ఆడపెళ్ళివారి యింటికిమల్లే సందడిగా వుంటుదన్నమాట.

ఇంతచక్కటి, చల్లటి పర్వతాలు కనుకనే మనపెద్దలు హిమాలయాలను గురించి ఎన్నో ముచ్చటైన కథలు కూర్చిపోశారు. మనంకూడా ఒకటి రెండు కథలు వచ్చేనెల "బాల"లో చెప్పుకుందాం.

# పాడవోయ్ — పాపాయీ!

("తల్లినినిమించే దైవము వేరే"— అనే సినీమాపాట వరుస)

స్వాగతమమ్మా భారతమాతా! సర్వసుఖాభరితా!
త్యాగభూమియని కీర్తినొందీ - తరియించినావమ్మా ॥స్వా॥
మంచుకొండలే కరిగెడిదాకా - యేల శత్రుభయమూ?
ముదమూ, గనుమూ
కరుణా, సేవా, గల్గిన గాంధీ ఘనసుతుడుండెగదా!
పరమ శత్రువైనా ఒకనస్వాకు పలుకరించుగాదా ॥స్వా॥

—సూరిశెట్టి సాంబశివరావు బాబ్జీ
(కవితామండలి)




# దసరా సరదా

[దసరా పండగను గురించి మాకు యెందరో వ్యాసాలూ, పద్యాలూ పంపేరు. అందులోనివి తీసి యీ నాటిక వ్రాయ బడ్డది—సం॥]

[సరస్వతమ్మ గారింట్లో]

జానకి:-దసరాదశిమీ వొచ్చింది।
బట్టలుకొత్తవి కడతాము।
బాణాలెన్నో కొంటాము।
పువ్వులు గలగలకొడతాము॥

* * *

ఢిల్లీ కెళ్లిన మాబావ
దసరా సెలవల కొస్తాడు
మిఠాయిలెన్నో తెస్తాడు
గుటుక్ సటుకుమని తింటాము

నాన్నా బొమ్మలు కొంటాడు
అమ్మా కొలువూ పెడ్తుంది
లక్కా బొమ్మలు తెస్తాను
రాజూ రాణీ పెడ్తాను

* * *

పాపలందరూ వొస్తారు
నువ్వా వేళా రావాలి
కోతీ కొమ్మచ్చాడ్తాము
గవ్వచ్ మువ్వచ్చాడ్తాము

* * *

కిచకిచమంటూ నాన్నా అమ్మకి
మాటలకడ్డం వొస్తాము
కిల కిల కిల కిల కిల కిల కిల కిల
కిల కిల కిల కిల కిల కిల కిల కిల

(యస్. యస్. ఆర్.)

తల్లి—ఏం జానకీ! ఏమిటా సందడీ?

జానకి—అమ్మా! వేగంగా జడ వేసీవే... వేళయి పోతోంది!... పొద్దున్నే ఏడు గంటల కల్లామా మాష్టారు రమ్మన్నారే!

తల్లి—అయితే దువ్వెనా నూనె సీసా తెచ్చుకో... ఏడీ అన్నయ్యేడీ?

జానకి—అన్నయ్య—నాన్న గారి గదిలో కృష్ణుడు వేషం వేసుకుంటున్నాడే... ముందు నాకు జడవేసీ.

తల్లి—సరే... కూచో...

* * *

జానకి—అమ్మా... నాకు పువ్వుల జడవేసి, కిరీటం పెట్టవే...

తల్లి—అలాగే...

జానకి—అమ్మా... జరీ పువ్వుల కండువా వేసుకుంటానే—

తల్లి—అలాగే నమ్మా... వెళ్ళి శుభ్రంగా కాటికా బొట్టూ పెట్టుకుని... రా.

గోపు—చెల్లాయి! ఇంకా ఇక్కడేం చేస్తున్నావ్?... రా! వేళయి పోయింది.

జానకి—ఇదుగో ఒస్తున్నాను. నా బాణం ఏదీ?

గోపు—నీబాణం నాన్నగారి టేబిలు మీదుంది వెళ్ళి తెచ్చుకో—

జానకి—అమ్మా—వెళ్ళొస్తామే-

తల్లి—జాగ్రత్త! పొద్దెక్కకుండా ఒచ్చెయ్యండి.

---

[మంగయ్య మేష్టరు బడిలో—పిల్లలందరూ రెండు బుట్టల బాణాలూ, మూడుబుట్టల బాణాలూ. పువ్వుల బాణాలూ చిలకల బాణాలూ—రంగు రంగుల బాణాలు పట్టుకొని, చెమ్కీ టోపీలు పెట్టుకొని ముస్తాబై వచ్చారు]

మేష్టారు—ఏంవర్రా! అందరూ వచ్చారా?

పిల్లలు—ఒచ్చేం సార్!

మేష్టారు—సరే! వరసగా నిలుచోండి......ఒరెయ్ శర్మా! నీ బాణం ఏదిరా?

శర్మ—(ఏడుస్తూ) నా బాణం విరిగి పోయింది సార్.

మేష్టారు—సరే—నువ్వు అలా వెళ్ళి వెనక్కి నుంచో...గోపూ... నువ్విలారా...ముందుకు వచ్చి నిలబడు. జానకీ...నువ్వుకూడా...అందరూ దసరా పద్యాలు కంఠస్థా పెట్టేరా?

పిల్లలు—పెట్టేం సార్!

మేష్టారు—సరే పదండి—

ఒకరు—మేష్టారూ! ఇప్పుడు మనం ఎవరింటికండీ వెళ్లడం?

మేష్టారు—ఇవాళ ఛెయిర్మన్ గారింటికి వెళదాం?

పిల్లలు—మేష్టారూ మా ఇంటికో?

రామం—మేష్టారూ! మా యింటికెప్పుడండీ?

సుబ్బు—మా ఇంటికో?

మేష్టారు—స్! కేక వెయ్యకండి. అందరిళ్ళకీ వెళదాం...

చిన్నపిల్లవాడు—మెత్తాలూ! మలీ పప్పు బెల్లాలు ఎప్పులిత్తాలండీ?

మేష్టారు—ఇస్తాలే, బాబూ! మనం ఛైర్మానుగారింటికి వెళ్లేక అక్కడిస్తారు...ఊఁ-ఇంక నడవండి.

జానకీ—నువ్వూ గోపూ కలిసి దసరా పద్యం మొదలెట్టండి—

గోపు—ఏ పద్యం సార్?

మేష్టారు—అనకాపల్లినుంచిస్వామి ఆలస్యనాథ్ గారు పంపిన పాట పాడండి.

[గోపీ—జానకీ పాడుతారు]

మీఅమ్మ మాఅమ్మ - మన అమ్మ కాదా
అమ్మరో మాఅమ్మ - భరతమాతమ్మ
బాలులారా మనము - భారతీయులము
పాతయుద్ధాలతో - పని లేదుమాకు
గెల్చేమురా మనము - నేటియుద్ధాన
ఒటమిని చేపేయి - శత్రు దేశాలు
వినిపించుచున్నాయి - విజయ భేరీలు
లేదయా మనకింక - బాంబులభయము
స్వాగతాలిచ్చేరు - శాంతి దేవతకు
పప్పు బెల్లాలతో - పని లేదుమాకు
బిరుదాలుపొందేము - ఇదివర కేమేము
కనికరించివద్దు - కట్నాలుమాకు
స్వాతంత్ర్యమివ్వాలి - మాతృ దేవతకు
కావాలి భావాలు - గాంధి దేవుడివి
విజయదశమికి మాకు - విజయమివ్వాలి
జయజయా జయజయా - జయమహా విజయ॥

పిల్లలు—జయా!

[కొత్తపేట—ఛైయిర్మన్ గారింట్లో]

దసరా పిల్లలు

మేష్టారు—ఊఁ...ఆగండి...ఇదే ఛైయిర్మన్ గారిల్లు—లోనికి పదండి-

ఛైర్మన్—ఓహో! మేష్టారూ! ఈ ఏడు చాలా మంది పిల్లల్ని తెచ్చేరే!

మేష్టారు—చిత్తం చిత్తం...త మ దయ...ఏదమ్మా అనసూయా! నువ్వూ రామం కలిసి దసరా పద్యం మొదలెట్టండి.

అనసూ—ఏ పద్యం అండీ మేష్టారూ?

మేష్టారు—శ్రీ నారపరెడ్డి రామిరెడ్డిగారు (కోవూరు) రాసిన దసరా పద్యం చదవండి.

పిల్లలు—

శ్రీ విజయదశమిద్ది వీరపూజలకు
అసురుల బలిగొన్న అమర బాణంబు
రావణసంహారి రాముండు నేడు
పూజచేసినయట్టి పుణ్యదినంబు
తెలుగుజాతీయత తెలుగుపౌరుషము
తెలుగుదనమే నేడు తెల్లవోయినది
తెలుగుబిడ్డలమయ్యు తెలుపుచున్నాము
తెలుగువీరులస్మృతి తియ్యగావినుడు.
తెలుగుమాటల్లోని తీయ తేనియలు
తెలుగుపాటల్లోని తేటభావాలు
తెలుగుకోయిలపాట తీవరించినది
తెలుగుచివుళ్ళలో తెప్పరించినది
తెలుగుభానుడు నేడ తెరవీడినాడు
తెలుగురక్తపుతేట కలగిపోలేదు
తెలుగుకత్తులకాంతి తీసిపోలేదు
తెలుగుజెండాదీప్తి దిశలుప్రాకింప
తెలుబిడ్డలు నేడె దీక్షబూనండి ॥జయా॥

మేష్టారు—ఇంకో పద్యం చదవండి.

పిల్లలు—

ఏదయా మీదయా మామీద లేదు
ఇంతసేపుంచడము ఇదిమీకు తగున
దసరాకివస్తిమని విసవిసలుపడక
చేతులో లేదనక అప్పివ్వరనక

ఇరుగుపొరుగులవారు ఇస్తారుసుమ్మ
ఆకలిక్షణమైతే అంటేదిలేదు
పావలాఇస్తేను పట్టేదిలేదు
అర్ధరూపాయిస్తె ఆగేదిలేదు
ముప్పావలాయిస్తె ముట్టేదిలేదు
ఇచ్చురూపాయిస్తె పుచ్చుకుంటాము
( అటుపైని పావలా పప్పుబెల్లాలు )
అయ్యవారికిచాలు అయిదువరహాలు
పిల్లవారికిచాలు పప్పుబెల్లాలు
శీఘ్రముగ పంపుడీ శ్రీమంతులారా ॥జయా॥

ఛైర్మన్—ఇదుగో పప్పు బెల్లాలు, సిద్ధంగానే ఉంచేం... మేష్టారూ! ఇదుగో మీకు కట్నం,...మీ పిల్లలికి పప్పు బెల్లాలు పుచ్చుకోండి.

పిల్లలు—

దీవనలు పద్యాలు తేజముగవినుడీ
దీవించవచ్చితిమి దిటముగా మేము
బాలురదీవనలు బ్రహ్మదీవనను
చేకొనివినరయ్య శ్రీమంతులారా
శ్రీరస్తు విజయమంగళ సిద్ధిరస్తు
వస్తువాహన పుత్ర సంతానమస్తు
కొడుకులను కోడండ్రు కొమరొప్పగలిగి
పాడియావులు పదివేలుగాగలిగి
ధనధాన్యములుగలిగి ధర్మముల్ గలిగి
భువిలోన వెలలేని భోగముల్ గలిగి
రాజసన్మానంబు రాజ్యంబుగలిగి

బంధుజాలంబులో ప్రఖ్యాతిగలిగి
తనయులకు తనయులకు తనయులన్ కలిగి
మనుమలకు మనుమలకు మనుమలన్ కలిగి
ఒడుగులును పెండ్లిండ్లు వరుసతో గలిగి
ఎడబడని సంపదలు ఏప్రొద్దుగలిగి
ఇష్టార్థములుమీకు ఎప్పుడున్ గలిగి
పుడమివర్ధిల్లుడీ పుణ్యాత్ములారా
ఏడాదికొక దినము వేడుకను మేము
చూడచూడగవచ్చి కొనియాడినాము
చక్కగా మాపదము చొక్కివినరయ్య
జయవిజయ జయ భవతు దిగ్విజయభవతు

||జయా|| [illegible]

మేస్టారు—అయ్యా! ఇంక సెలవు తీసుకుంటాం...

చెర్మన్—మంచిది.

మేస్టారు—పందండ్రా... కోవిల వీధికి వెళదాం...

పిల్లలు—(పాడుకుంటూ, వెళ్లుతూ)

"అయ్యవారికి చాలు అయిదు వరహాలు; పిల్లవారికి చాలు పప్పుబెల్లాలు"—

---

## ఇది మీకు తెలుసునా?

ఇంగ్లాండు దేశంలో పిల్లలకు 5 ఏళ్ళు వచ్చేటప్పటికి తల్లితండ్రులను విడిచి దూర దేశంలో గురువులదగ్గర చదువుకుంటానికి పోతారు. వారికి 15 ఏళ్ళు వచ్చేవరకు తల్లితండ్రుల దగ్గరకు రారు. ఈ పద్ధతివల్ల చదువుకోటాన్కి మంచి అవకాశం దొరకుతుంది కదూ?

—"కన్నబాబు"

# కొలువు పాట

## (అన్నయ్య)

కొలువోయ్ కొలువూ!

బొమ్మల కొలువూ - చూడాలంటే

రారండోయ్ చెలులారా ||కొలువోయ్||

కొత్తబొమ్మలూ - పాతబొమ్మలూ

జిగజిగ మెరిసే - జరీబొమ్మలూ

లక్కబొమ్మలూ - కుండబొమ్మలూ

కొండపిల్లిబల్ - కర్రబొమ్మలూ ||కొలువోయ్||

* * * *

మెట్లు మెట్లుగా - బల్లలు పేర్చేం

బల్లల పైనన్ - బట్టలుపరిచేం

పెద్దబొమ్మలక్ - పైనను పేర్చేం

చిన్నబొమ్మలన్ - దిగువున పేర్చేం ||కొలువోయ్||

* * * *

అట్టలుతోనే మేడలుకట్టేం

మేడలలోనూ దీపాలెట్టాం

న[illegible]కైనా రాజూరాణీ

గాజుబొమ్మలక్ అందునఉంచాం ||కొలువోయ్||

* * *

అందమైనఒక పార్కును వేశాం

అందునపువ్వుల మొక్కలవేశాం

ఇసుకతిన్నెలా రోడ్డులు వేశాం

రోడ్ల పైన మోటారులు నిలిపేం ||కొలువోయ్||

---

మదరాసు ఆలిండియా రేడియో వారి అనుమతితో



# బాలరచనలు

## బాలసంఘం

బాలసంఘ సభ్యులం,
భరతమాత పుత్రులం,
కలసిమెలసి యుండెదం
"బాల" నెపుడు చదివెదం.

—వేదుల వెంకటసూర్యనారాయణమూర్తి
(సం॥ 14) మదరాసు.

## దేశభక్తి

భారతదేశము - మనదేగా
భారతపుత్రులు - మనమేగా
భారతమాతను - పూజిస్తాం
భారతదాస్యం - తొలగిస్తాం ॥భా॥
భాలతావనీ - విహరిస్తాం
భారతవీధుల - పయనిస్తాం
భారతజెండా - ఎగరేస్తాం
భారతవీరుల - మనిపిస్తాం ॥భా॥

"చిట్టిబ్బాయి"
నవభారతి గురుకులవిద్యార్థి.

## ఊయలబాల

ఉయ్యాలలోపల
ఉన్నాది "బాల"
అందరిని నవ్వించు
అందాల "బాల"

—న్యా. హనుమాయమ్మ,
(సం॥ 13) భీమవరం.

## పండుగబాల

చిన్నారి పొన్నారి—
ఓ చిట్టిబాలా!
నీవొచ్చి మాయిల్లు
పండుగాచేశావు
వచ్చినరోజంతా
ఆనందమాయె ॥చి॥

—చింతాడ సావిత్రీదేవి,
మదరాసు.

## ముసలమ్మ—చిలుక

(హిందీకథను అనుసరించి)

పిల్లలారా! ఒక కథ చెపుతాను వినండి. అనగాఅనగా ఒక ముసలమ్మ. ఆమె ఒక చిలుకను పంజరంలోపెట్టి పెంచుతోంది. ప్రతిరోజూ ముసలమ్మ పాయసం వండుతుంది. పాయసం వండినపుడెల్లా చిలుక పాడుతుంది. ముసలమ్మ పాయసంవండి ప్రతిరోజూ చిలుకకు పెటుతూఉండేది. ఒక

నాడు ముసలమ్మ స్నానంచేసి పాయసం వండుతోంది. చిలుక పాటపాడుతోంది. ముసలమ్మకు చాలా ఆకలిగా ఉండడంవల్ల, చిలుకమాట మరిచిపోయి పాయసంఅంతా, తనే తినేసింది. చిలుక కేదీ పాయసం? పాపం! అది రాత్రల్లాఏడుస్తూ కూర్చుంది.

మర్నాడు తెల్లారింది, కోడి కూసింది. ముసలమ్మ పంజరం తలుపుతీసి మెల్లిగా చిలుకను పిలిచింది. పంజరంతలుపు తీయగానే చిలుక బయటికివచ్చి, ముసలమ్మను పాయసం పెట్టనందుకు ముక్కులో పొడిచింది. ముసలమ్మ భయపడి పరుగెత్తుతోంది. దాని వెనక్కాలే చిలుక పరుగెత్తింది. "చిలుకా, చిలుకా! నన్ను పొడవవద్దే! నీకు పాయసం వండిపెడతాను" అంది ముసలమ్మ. "సరే! పాయసం వండిపెట్టు" అంది చిలుక.

ముసలమ్మ పాయసం వండుతోంది. చిలుక ముసలమ్మపక్కనే కత్తిపీటమీద కూర్చుని చూస్తోంది. పాయసం ఉడికింది. ముసలమ్మ గిన్నెదింపింది. పళ్ళెంలో సగం పాయసంపోసి చల్లార్చింది. చల్లార్చిన పాయసం అంతా చిలుక తినేసింది. మళ్ళీ ముసలమ్మ పాయసం పళ్ళెంలో పోస్తోంటే చిలుక అందిగదా "ముసలమ్మా ముసలమ్మా! నాకు పాయసంచాల్లే! గిన్నెలో పాయసం నువ్వుతిను. నాకంటే నువ్వు పాయసం పెట్టలేదుగాని నీకు పాయసం పెట్టకుండా నేనుంటానా?"

సి. వి. మల్లికార్జునమూర్తి (సం॥ 14)

## మాలలు; మంగళ్లు

అసలు అంటరానితనము మన దేశంనుంచి పోవాలని గాంధీ మహాత్ముడు చెబుతూవుంటే, వున్నవాళ్ళు చాలనట్లు యింక కొత్త మాలవాళ్ళు, మంగళ్ళు అన్నిజాతుల్లోనూ పుడుతున్నారు:

కొత్తమాలవాళ్ళు:—

డ్రామాలవాళ్లు, సినిమాలవాళ్లు.

మంగలివాళ్ళు:

నామంగలవాళ్లు, నీమంగలవాళ్లు.

—గోపాల్ (సం॥ 12)



# ఇది చెప్పుకో చూద్దాం!

[మీకు పొడుపు కథలూ, చిక్కు ప్రశ్నలూ అంటే చాలా ఇష్టం కదూ? ఈదిగువన కొన్ని పొడుపు కథలూ, చిక్కు ప్రశ్నలూ ఇచ్చేం. ఏదీ చెప్పుకోండి చూద్దాం!—సం॥]

## I

## వింత పండు

ఒక రోజూ, ఒక రాజూ కలుస్తే ఒక పండు అవుతుంది.

ఆ పండేమిటి?

## II

## అక్షరమాల

పూవులన్నీ సరిగా కూర్చి
'పూలమాల' చేసినట్టు,
అక్షరాలన్నీ కూర్చి, మనం
మాటను చేస్తాం కాదూ!

ఏది యీ 'అక్షరమాల' అనే చిక్కు ప్రశ్న చేయండి చూద్దాం?

ప్రశ్న :— నేను అయిదు అక్షరాల ఆంధ్ర వీరుడను.

1, 2 అక్షరాలు చేరి ఒక చక్కని మాసపత్రిక పేరు

3, 4. 5 అక్షరాలు కలిస్తే 'చుక్కల రాజు' అవుతుంది.

నేనెవరు?

## దూరపుచుట్టం

నేను నాలుగు అక్షరాల దూరపు చుట్టాన్ని, నా మొదటి రెండూ కలిస్తే, కొందరి పిల్లల్ని కోతి అనడానికి అదొక్కటే తక్కువ!

ఆఖరి రెండూ చక్కదనంలేని "చక్కని చుక్క"ని

మొత్తంగా నన్నెప్పుడోగాని చూడవు నేనెవరు?

[ఈ పై ప్రశ్నలకు ఎవరెవరైతే సరియైన జవాబు పంపుతారో వారిపేర్లు వచ్చే సంచికలో వేస్తాం.]

# సెప్టెంబరు 'బాల' లోని ప్రశ్నలకు జవాబులు

## గీతల తమాషా

క్రిందటి నెల ఇచ్చిన గీతల తమాషా ఇలాగ పూర్తిచేస్తే నాలుగు గీతలు ఒస్తాయి.



ఇలాగ పూర్తిచేసి పంపినవారి పేర్లు:

గుంటూరు :—S. N. బలరామన్.

దౌలతాబాద్ :—B. M. పట్టాభి,
K. V. పతి,
కాంతలక్ష్మి.

క్రొత్త ఢిల్లీ :— వావిలకొలను కృష్ణకుమారి.

విజయనగరం :—డి. లక్ష్మణరావు.

రాయఘడ (ఒరిస్సా):—K. వీరరాఘవరావు.

## పొడుపు కథలు

క్రిందటి నెల ఇచ్చిన పొడుపు కథలకు సమాధానాలు :—

1. సంవత్సరం; పన్నెండు నెలలు; ముప్ఫై రోజులు; శుక్లపక్షం; కృష్ణపక్షం.

3. కంచంలో చేతి వేళ్ళు.

3. కాకరకాయ
   బెండకాయ
   బీరకాయ
   పొట్లకాయ

4. నెమిలి.

---

గమనిక:- మా కార్యాలయానికి దయతో కొందరు భాషాభిమానులు తాము రచియించిన పుస్తకాలు పంపేరు. మైసూరునుండి "అఖిల కర్ణాటక బాలసంఘము" వారు వారి వార్షిక నివేదిక పంపేరు. వాటినిగురించి ఒచ్చేసంచికలో విపులంగా వేస్తాం —సం॥




# తెలుగుపిల్లల ప్రోగ్రాముల వివరాలు

## అక్టోబరు తే 1—31 వరకు

**7 వ తేదీ ఆదివారం :**

మధ్యాహ్నం 2-10 నుంచి 3 వరకు ; పిల్లల సరదా ప్రోగ్రాం—పిలుపు పాట ; ఉత్తరాల సంచి ; బుద్ధిమంతుడు—నాటకం ; పుట్టిన రోజులు ; పగడాలదీవి—రూపకం ; తాతయ్య కబుర్లు ; పిల్లల కథలు, పాటలు, అవీనీ ; సెలవు పాట.

**14 వ తేదీ ఆదివారం :**

మధ్యాహ్నం 2-10 నుంచి 3 వరకు; పిల్లల సరదా ప్రోగ్రాం—పిలుపు పాట ; ఉత్తరాల సంచి ; నవాబు [illegible] బస్తాలు—నాటకం ; పుట్టిన రోజులు ; పిల్లి బావ—బుర్ర బావ—పాట కథ, జేజి మామయ్య పాటలు ; మీరు పంపిన కథలు, పాటలు, అవీనీ ; సెలవు పాట.

**21 వ తేదీ ఆదివారం :**

మధ్యాహ్నం 2-10 నుంచి 3 వరకు ; పిల్లల సరదా ప్రోగ్రాం—పిలుపు పాట ; ఉత్తరాల సంచీ ; సిండ్రిల్లా—నాటకం ; పుట్టిన రోజులు ; తొక్కుడు బిళ్ల—ఆటలు ; ఎద్దులు—పులి—సంగీత నాటిక ; మీరు పంపిన కథలు, పాటలు, అవీనీ ; సెలవు పాట.

**28 వ తేదీ ఆదివారం :**

మధ్యాహ్నం 2-10 నుంచి 3 వరకు ; పిల్లల సరదా ప్రోగ్రాం—పిలుపు పాట ; ఉత్తరాల సంచీ ; నిలుచోలేని అబ్బాయి నాటకం ; పల్లెటూరి జీవనము—పాట కథ ; పుట్టిన రోజులు ; కొంగ—కోకి—నాటిక ; మీరు పంపిన కథలు, పాటలు, అవీనీ ; సెలవు పాట.

# బడిపిల్లల ప్రోగ్రాములు

**16 వ తేదీ మంగళవారం :**

సాయంకాలం 4-30 నుంచి 5 వరకు ; ఎలిమెంటరీ స్కూలు పిల్లకు: మంచి ఇల్లు ప్రసంగం ; సర్ గలహాడ్ వీరుని గురించి ప్రసంగం.

**18 వ తేదీ లక్ష్మీవారం :**

మధ్యాహ్నం 3 నుంచి 3-30 వరకు—హైస్కూలు పిల్లలకు: కుంటి తైమూర్—ప్రసంగం ; ఆకాశము పై[illegible]కము—ప్రసంగం.

**19 వ తేదీ శుక్రవారం :**

సాయంకాలం 4-30 నుంచి 5 వరకు ; ఎలిమెంటరీ స్కూలు పిల్లలకు-మ్యూనిసిపల్ కౌన్సిలు-ప్రసంగం.

**23 వ తేదీ మంగళవారం :**

సాయంకాలం 4-30 నుంచి 5 వరకు ; ఎలిమెంటరీ స్కూలు పిల్లలకు—ఇంట్లో గాలి, వెలుతురు—ప్రసంగం ; శతభిష నక్షత్రం—ప్రసంగం.

**25 వ తేదీ లక్ష్మీవారం :**

మధ్యాహ్నం 3 నుంచి 3-30 వరకు ; హైస్కూలు పిల్లలకు ; తిక్కన—ప్రసంగం ; తిక్కన కవి రచనలు—పఠనము.

**26 వ తేదీ శుక్రవారం :**

సాయంకాలం 4-30 నుంచి 5 వరకు ; ఎలిమెంటరీ స్కూలు పిల్లలకు ; ఊళ్ళోనీటి వసతులు—ప్రసంగం ; పాటలు.

**30 వ తేదీ మంగళవారం :**

సాయంకాలం 4-30 నుంచి 5 వరకు ; ఎలిమింటరీ స్కూలు పిల్లలకు—ఇంటికి నీటి వసతులు—ప్రసంగం ; విపిన్ వీరుడు—ప్రసంగం.

# ఏంరాజు!

ఈ మిఠాయి పొట్లం చూచారూ? ఇది మీరు వరసగా ఎంత త్వరగా చదివితే అంత మిఠాయి మీరు తినగలరన్నమాట!—

—పన్యాలన్నయ్య

దిద్దిమలక పోతరాజు

ద్దిమలక పోతరాజు

మలక పోతరాజు

లక పోతరాజు

క పోతరాజు

పోతరాజు

తరాజు

రాజు

జు

Edited and Published by N. Raghava Rao, 20, Sundareswar… ylapore
Madras. Printed by V. Kuppuswamy Chetty at Bharat… ss,
39, Anderson St. G. T. Madras.


Directed by
B.N.REDDI
CAMERA..... BARTLEY
SOUND...... DINSHAW
ART......... NAGOOR
Studio...NEWTONE
నాగయ్య...జయమ్మ...భానుమతి
నారాయణరావు...లింగమూర్తి...శివరావు
నటించిన...
వాహిని
వారి
స్వర్గసీమ
వస్తున్నది.......